





శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక–16



పార్థసారథి పెరుమాళ్, తిరువళిక్కేణి



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గియ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీరామాయణతత్త్వమ్

(శ్రీశైల చక్రవర్తి ఆచార్యర్ వారి వ్యాసం ఆధారంగా)

## పూర్వపీఠిక

"వెంగదిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కాయ్" (సూర్యవంశానికి అద్వితీయమైన దీపమై), "కౌశలైతన్ కులమదలాయ్" (కౌసల్యా దేనికి కుమారుడై), దశరథుని పుత్రుడై అవతరించినవాడైన, కళ్యాణగుణసముద్రుడైన శ్రీరాముని అవతార దినమైన ఈ పుణ్యదినంలో పెద్దల ఆజ్ఞను అనుసరించి, శిరసా వహించి, దాసుడు శ్రీరామాయణంలోని కొన్ని తత్వాలనుగూర్చి కొద్ది సమయం సేపు చెప్పడానికి ప్రయత్నిస్తాను.

## ప్రతిపాదింపబడే విషయసంగ్రహమ్

"కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తరమ్" (శ్రీరామాయణం –బాలకాండ –3 –8) అనే విధంగా శ్రీరామాయణంలో ధర్మం, అర్థం, కామం, మోక్షం అనబడే నాలుగు పురుషార్థాలలో– ధర్మం, మోక్షం అనే ఇవి విస్తారంగాను, అర్థం, కామం అనే ఇవి సంగ్రహంగాను నిరూపింపబడ్డాయి. "సముద్రమివ రత్నాఢ్యమ్" అనే విధంగా సముద్రంలో ముత్యాలు, పగడాలు మొదలైన రత్నాలు లోపల మరగుపడి ఉన్నట్లుగానే, అందమైన గొప్ప అర్థరత్నాలు శ్రీరామాయణంలో అణగి ఉన్నాయి. ఇందులో పలు వేదాంత రహస్యాలు, లోకనీతులు, రాజనీతులు, పురుష ధర్మాలు, స్త్రీధర్మాలు అంతటా పొదగబడి ప్రకాశిస్తున్నాయి. ఇది, వ్యంగ్యార్థ ప్రధానమైన ఉత్తమోత్తమ కావ్యం అయినందువల్ల, పై పైన గమనించి చూసినప్పుడు కనిపించని గంభీరమైన అర్థాలు, గమనించి, గమనించి చూచి గ్రహించవలసినవి, చాలా ఉన్నాయి. ఇందులో కథా భాగాలు అందరికీ తెలిసినవే అయినందువలన,

వాటిని విస్తరించి చెప్పకుండా, తప్పకుండా తెలియవలసిన ముఖ్యవిషయాలలో కొన్నిటిని మాత్రం ప్రస్తావిస్తాను.

రామాయణంలో అశోకవనంలో చెరలో పెట్టబడిన సీతాదేవివైభవం తెలియజేయబడిన ప్రకారం శ్రీరామాయణం మొత్తం ముఖ్యంగా అశోకవనంలో చెరలో పెట్టబడిన సీతాదేవి గొప్పతనం చెప్పబడినది— అని మన పెద్దల అభిప్రాయం. ఈ దేవదేవ దివ్యమహిషి తన మహిమను, గొప్పతనాన్ని, చెరలో ఉన్నందువల్ల ఏర్పడే తక్కువదనాన్ని చూడకుండా, దేవకాంతల చెరను పోగొట్టడం కోసం, తాను చెరలో ఉండడం అనేది దయాపరవశమైన కార్యమే కదా. చేతిలో ఉండే బిడ్డ చేయి జారి మురికిగుంటలో పడిపోతే, ఆ బిడ్డ తల్లిగాని, తండ్రిగాని ఏ మాత్రం సందేహించకుండా, ఆ గుంటలోకి దూకి బిడ్డను బయటకు తీసినట్లుగానే, చేతనులు పడి క్లేశపడే సంసార సాగరంలో కర్మమూలకమైన జన్మ లేని తాను వచ్చి జన్మించి, ఈ లోకంలో జన్మించినవారు పడే బాధలు అన్నీ తాను పడి, రక్షించినందున మాతృత్వ సంబంధంతో ఏర్పడిన సీతాదేవికి కల వాత్సల్యాన్ని ఈ గ్రంథం వ్యక్తం చేస్తున్నది. ఈ వాత్సల్యంలోని అతిశయాన్ని నమ్మాళ్వారులు "తని చ్చిఱైయిల్ విళప్పుఱ్ఱ కిళిమొழியాళ్" (అసాధారణమైన చెరలో ప్రకాశాన్ని పొందిన, చిలుక వలె తీయగా పలికే సీతాదేవి) అనే సూక్తి ద్వారా వ్యక్తం చేశారు. కర్మకారణంగా చెరలో ఉంటే, అది నైచ్యం అవుతుంది. తనన ఆశ్రయించినవారైన దేవతాకాంతల చెరను విడిపించడం కోసం తన అతిశయించిన దయతో బలవంతంగా ఈ చెరను సీతాదేవి అనుభవించింది కనుక, ఈ విధంగా ఆమె చెరలో ఉండడం అతిశయానికి కారణం అవుతున్నది. సంసారులవలె గర్భవాసం చేసినా, భగవంతుడు జన్మించే జన్మ ఆ భగవంతునకు తేజస్సును కలిగిస్తున్నది— అనే విషయాన్ని "నిలవరంబిల పల పిఱప్పాయ్". (ఒక అవధి లేని, ఏ నియమం లేని పలు జన్మలను కలిగినవాడై) అని దివ్యసూరులు తెలిపారు. వేదం కూడా "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (అతడు ఒక్కడే అవతరించగా, అవతరించగా అతిశయించిన కాంతిని పొందుతున్నాడు) అని

తెలిపింది. ఎందుకంటే, కర్మతో అవతరించడం కాకుండా, కేవలం తన ఇచ్ఛతో, "ఆశ్రితులను అనుగ్రహించాలి" అనే ఉద్దేశ్యంతో అవతరించినందున ఇటువంటి కాంతి భగవంతునకు కలుగుతుంది. లోకంలో ఒకడు జన్మలను ఎత్తే కొద్దీ, కర్మబంధం వల్ల అతని గొప్పతనం తగ్గుతూ వస్తుంది. భగవంతుడు మాత్రమే, జన్మించగా, జన్మించగా తేజస్సు వృద్ధి అయ్యేటట్లుగా అవుతున్నాడు. భగవంతుడు అవతరించి తన భక్తులకు అనుగుణంగా కార్యాలను చేయడం వల్ల, అతని సౌలభ్యం అనే మహాగుణం వ్యక్తమై, అతని తేజస్సు వృద్ధి పొందుతున్నది. "తేరు మూర్ న్దు తేశు యార్ న్ద శెల్వ దెయ్ వనాయక" అని అంటూ ఈ విషయాన్ని తిరుమళిశై ఆళ్వారులు తిరుచ్చంద విరుత్త ప్రబంధంలో అనుగ్రహించారు. ఆ విధంగానే, లక్ష్మీదేవి విషయంలో కూడా, అశోకవనంలో బందీగా ఉండడం ఆమెకు తేజస్సును కలిగించినది అవుతున్నది. "ఈ వాస్తవాన్ని తెలియకుండా, బలాత్కారంగా రావణుడు ఈమెను చెరలో పెట్టాడు అని జ్ఞానం లేని అల్పులు పలుకుతున్నారు" అని మన పూర్వాచార్యులు అన్నారు. హనుమంతుని తోకకు గుడ్డలను చుట్టి, నిప్పును అంటించిన వార్తను విని "శీతో భవ హనుమతః" (అగ్నిదేవా! హనుమంతునకు నువ్వు చల్లనివాడవు కావాలి. (సుందర– 33 –29) అనే విధంగా "వేడిగా ఉండే నీ స్వభావాన్ని మార్చుకొని జలానికి కల చల్లని స్వభావాన్ని నీవు పొందాలి" అని అగ్నిని ఆజ్ఞాపించి, అగ్నిని చల్లగా ఉండేటట్లు చేయగలిగిన సీతాదేవి, "దగ్ధో భవ" (నీవు భస్మమైపోదువు గాక) అని రావణుని శపించలేదా? ఆ విధంగా చేయకపోవడానికి గల కారణాన్ని మహర్షి

**"అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్,**
**న త్వాం కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హతేజసా"**(సుందర– 20 –20)

(శ్రీరాముని ఆజ్ఞ లేనందువల్ల, పారతంత్ర్యం అనే గుణాన్ని నేను పరిపాలిస్తున్నందున, ఓ రావణా! నేను, నిన్ను భస్మం చేయగలిగిన తేజస్సును కలిగినదానను అయినా, నా తేజస్సుతో నిన్ను భస్మం చేయడం లేదు)

అని వ్యక్తం చేసింది. అంట, శ్రీరాముని ఆజ్ఞ లేనందు వల్ల, నా తపస్సును రక్షించుకోవలసి ఉన్నందువల్ల భస్మం చేయవలసిన నిన్ను నేను భస్మం చేయడం లేదు— అని అన్నది. అందుచేత, అశోకవనంలో సీతాదేవి బందీగా ఉండడం తన అనుగ్రహం వల్లనే. ఇతరులను రక్షించడం కోసంగా చేసిన కార్యం కనుక, ఈమె దయ మొదలైన గుణాలకు అది ప్రకాశకం.

## శ్రీరామాయణం మొత్తం సీతాదేవికి సంబంధించినది

శ్రీరామాయణం మొత్తం సీతాదేవి గొప్పతనాన్ని చెబుతున్నది— అనేది శ్రీ వాల్మీకి భగవానుని చేత

**"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాః చరితం మహత్"** (రామాయణం— బాల— 4—7) (రామాయణ కావ్యం అంతా సీతాదేవి యొక్క గొప్ప చరిత్ర)

**"శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే"** (శ్రీ గుణరత్నకోశమ్— 14)

(ఓ శ్రీ రంగనాయకీ! శ్రీరామాయణం కూడా నీ చరిత్రలోనే మిక్కిలిగా ప్రకాశిస్తున్నది)

అని పరాశర భట్టర్ తెలియజేశారు. అంటే, ఈ కావ్యం మొత్తానికి సీతాదేవి చరిత్రయే జీవితం— అని అర్థం. "జీవితం వ్యంగ్య వైభవమ్" అనే విధంగా ఈ ఆదికావ్యానికి సీత యొక్క చరిత్రమే జీవనాడి— అని అభిప్రాయం. "రామస్య అయనమ్" అని అన్నప్పటికీ, "రామాయాః అయనమ్" అని అన్నప్పటికీ, రామాయణం అనే సమాసం ఏర్పడుతుంది కనుక, రామాయణం రామ చరిత్ర అని, రామా అనబడే సీతయొక్క చరిత్ర అని చెప్పే అవకాశం ఉన్నది. దీనిని మనసులో ఉంచుకునే "రామస్య చరితం కృత్స్నమ్" అని, "సీతాయాః చరితం మహత్ "అని వాల్మీకి పలికాడు.

## *తత్త్వహితపురుషార్థనిరూపణమ్*

వేదోపబృంహణాలలో ప్రధానమైన శ్రీరామాయణంలో, వేదంలోవలె, తత్త్వహిత పురుషార్థాలు చెప్పబడ్డాయి. శాస్త్రార్థాలను నిర్ణయించే ఉపక్రమం,

ఉపసంహారం మొదలైన న్యాయాల సంచారం చేసి చూస్తే, ఇది చక్కగా వ్యక్తం అవుతుంది. ఈ విధంగా శ్రీరామాయణం అనే ఈ ప్రబంధం "ఉపక్రమోపసంహారాభ్యాసాపూర్వతా ఫలమ్, అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే" — అనే తాత్పర్య లింగాలను అన్నిటిని పరిపూర్ణంగా కలిగినదై, శ్రీవాల్మీకి భగవానునిచే దర్శింపబడిన అద్వితీయమైన శరణాగతి వేదం— అని అభయ ప్రదానసారంలో శ్రీదేశికులు అనుగ్రహించిన విషయం ఇక్కడ అనుసంధించాలి. దీని భావం ఏమంటే — ఒక గ్రంథంలో ప్రతిపాదింపబడే విషయం ఏది? అని నిర్ణయించడానికి హేతువులు— అని చెప్పబడినవి ఏవి ?అంటే, ఆరంభం, పరిసమాప్తి మాటిమాటికి చెప్పడం, ఫలాన్ని నిరూపించడం, స్తోత్రం చేయడం మొదలైన లక్షణాలు. ఇవి, శ్రీరామాయణంలో పూర్ణంగా ఉన్నాయి. అంటే, శరణాగతి ఇందులో ఆరంభం నుండి ప్రతికాండలోనూ పలుమార్లు నిరూపించబడినందున, ఇది శరణాగతివేదం అని చెప్పదగినది అయినది. శ్రీరాముడుగా అవతరించిన శ్రీమన్నారాయణే — చతుర్ముఖుడు మొదలైనవారికి శరణ్యుడు, గ పరమ కారణమైన పరబ్రహ్మం— అనే అర్థం మొదటినుండి చివరి వరకు అక్కడ అక్కడ చెప్పబడింది. ఆ విధంగానే, పరతత్వవశీకరణ రూప శరణాగతియే పరమహితం —గొప్ప ఉపాయం —అని పలుచోట్ల నిరూపింపబడింది. దశరథుడు చేసిన యాగంలో హవిర్భాగాలను స్వీకరించడం కోసం వచ్చిన దేవతలు భగవంతుని శరణు పొందడం విశ్వామిత్రుని త్రిశంకువు శరణు పొందడం మొదలుగా సుమారుగా 20 సందర్భాలలో శరణాగతి చెప్పబడినందున, శ్రీరామాయణం శరణాగతి శాస్త్రం అని, దీర్ఘ శరణాగతి అని చెప్పబడుతున్నది. ఈ శరణాగతి అనే ప్రపత్తికి దేశనియమం, కాలనియమం, ప్రకార నియమం, అధికార నియమం లేదు. (ఈ వాక్యంలోని భావం ఏమంటే, —పుత్రులను ఆశపడేవాడు పుత్ర కామేష్టి యాగాన్ని చేయాలి— అని అన్నట్లుగానే, ఒక్కొక్క ఫలానికి ఒక్కొక్క ఉపాయం శాస్త్రాలలో చెప్పబడింది. ఈ శరణాగతి అయితే, అన్ని ఫలాలకు ఉపాయంగా ఉన్నది. ఆ విధంగానే, మిగిలిన ఉపాయాలకు అధికారి, దేశం కాలం—

అనే వీటిని విభాగం చేసి నిరూపించి చెప్పడం జరిగింది. స్నానం మొదలైనవానిని చేసిన తరువాతనే వైదిక కర్మలను అనుష్ఠించడానికి సాధ్యం అవుతుంది. అటువంటి నిర్బంధం ఈ శరణాగతికి లేదు. ఫలాన్ని పొందడంలో ఆశ కలిగినవాడు ఎవడైనా సరే, ఏ జాతికి చెందినవాడైనా సరే, ఏచోట అయినా సరే, ఏ కాలంలో అయినా సరే, ఏ దశలో ఉన్నా సరే, ఈ ఉపాయానికి అధికారియే. ఆకించన్యం, అనన్య గతిత్వం మొదలైనవానిని కలిగినవాడు ఈ ఉపాయాన్ని ఆచరించి, కోరిన ఫలాన్ని పొందవచ్చు— అని భావం). గుణపూర్తిని కలిగిన విషయ నియమమే ఉన్నది. దేవతలు చేసిన శరణాగతికి ఫలం రాక్షస నిరసనం, త్రిశంకువుకు ఫలం శరీరంతోడు స్వర్గానికి పోవడం, శునశ్శేపునకు, కాకాసురునకు ప్రాణరక్షణం ఫలం. లక్ష్మణునకు రామానువృత్తి, విభీషణునకు రామప్రాప్తి శ్రీరామునకు సముద్రతరణం అనేవి ఫలాలు. ఈ విధంగా ఆయా ప్రయోజనాలకు వారు వారు ప్రపత్తిని చేశారు.

పరమపురుషార్థం మోక్షమే అనేది కూడా ఇందులో ప్రతిపాదింపబడింది. జటాయువు, శబరి మొదలైనవారికి, "అన్ఱు శరాశరంగళై వైకుందత్తే*ఱ్ఱి*" (పెరుమాళ్ తిరుమొ*ழி*— 10 —10) (ఆనాడు, తన అవతార పరిసమాప్తి సమయంలో చరాచరాలను అన్నిటిని వైకుంఠానికి తీసుకునిపోయి) అని, "పుళ్పా. ముదలా పుల్లెరుంబాది ఒన్ఱిన్ఱియే నఱ్పాలుక్కుయ్ త్తనన్" (తిరువాయ్ మొ*ழி*— 7— 5— 1) (గడ్డిపరకలతో సహా అన్నిటినీ కూడా వైకుంఠానికి తీసుకొని పోయినవాడు) అని, "తిర్యగ్యోనిగతా శ్చాన్యే సర్వే రామమనువ్రతాః" (శ్రీరామాయణం— ఉత్తరకాండ —109 —22) (తిర్యగ్జాతికి చెందినవారు అందరూ కూడా రాముని అనుసరించారు), "వివేశ వైష్ణవం ధామ తేజ స్సశరీర స్సహానుజః" (శ్రీరామాయణం —ఉత్తరకాండం —110 —12) (పరమపదాన్ని శరీరంతో పాటుగా, తన తమ్ములతో పాటుగా ప్రవేశించాడు) అని చెప్పిన విధంగా అయోధ్యలో ఉండే చరాచరాలను అన్నిటిని ముక్తిని పొందేటట్లుగా చేశాడు— అని చెప్పబడినందున, ఆ ముక్తియే ఉన్నతమైన పురుషార్థం అని నిరూపింపబడింది.

## గంభీరంగా ఉండే అర్థవిశేషాలు కొన్ని

మహర్షిలో పలికే మాటలు అన్నీ ఇంచుమించుగా స్థూల, సూక్ష్మార్థాలతో కలిసే ఉంటాయి. పది ముఖాలు అనే పది ఇంద్రియాలతో కూడిన మనసు అనే రాక్షసరాజుచేత అధిష్ఠింపబడి, సంసార సముద్రంతో చుట్టబడి ఉండే లంక అనే శరీరం లోపల ఉండి, దీనదశను పొంది, బాధపడుతూ, ఆ సముద్రాన్ని దాటడానికి ఉపాయం తెలియలేక క్లేశపడుతున్న సీత అనే జీవుని విషయంలో హనుమంతుడు అనే ఆచార్యుడు తన నాయకుడైన భగవంతుని స్వరూపాదులను ఉపదేశించి, "ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో! "(తిరువాయ్మొழி)(భగవంతునితో కలసి ఉండడం ఏనాడు కదా) అని ఆశపడే విధంగా ఆర్తిని కలిగించి, దాని మూలంగా ఉపాయాన్ని పరిగ్రహించి, మోక్షాన్ని పొందేటట్లుగా చేస్తున్నాడు —అనేది వాల్మీకి మనసులోని అభిప్రాయం.

ఈ అర్థాన్ని

"దశేంద్రియానం ఘోరం యో మనోరజనీచరమ్,
వివేకశరజాలేన శమం నయతి యోగినామ్"
అనే సూక్తులను అనుసరించి శ్రీవేదాంతదేశికులు
"దర్పోదగ్రదశేంద్రియాననమనోనక్తంచరాధిష్ఠితే
దేహే ఽ స్మిన్ భవసింధునా పరిగతే దీనాం దశామాస్థితః,
అద్యత్వే హనుమత్సమేన గురుణా ప్రఖ్యాపితార్థః పుమాన్
లంకారుద్ధవిదేహరాజతనయాన్యాయేన లాలప్యతే"
(సంకల్ప సూర్యోదయమ్— 1— 72) అనే శ్లోకంలో అనుగ్రహించారు.

స్వాపదేశంలో (తత్వార్థాలను బోధించే వృత్తాంతాలు స్వాపదేశాలు, అన్యాపదేశాలు, పరోపదేశాలు— అని మూడు విధాలుగా విభాగింపబడతాయి. స్వాపదేశం అనేది తనకు జరిగినదానిని తెలిపి, దాని ద్వారా మిగిలినవారికి ఆ అర్థాన్ని

వ్యక్తం చేయడం. అన్యాపదేశం అంటే, తనకు జరిగినదానిని తానే తన మాటగా చెప్పకుండా, ఇతరుల మాట ద్వారా తెలియజేయడం. పరోపదేశం అనేది, ఇతరులకు వేరుగా ఉపదేశరూపంగా చెప్పడం. ఇక్కడ స్వాపదేశం అంటే, సీతాదేవి యొక్క అనుష్ఠాన వృత్తాంతం నిరూపించి, దానిద్వారా జీవాత్మలకు కూడా ఆ విధంగానే కలుగుతుంది—అనేది తెలుపబడుతున్నది —అని భావం. సీతాదేవిని జీవాత్మగా నిలిపి వాల్మీకి పలుకుతున్నారు. జీవాత్మ— పరమాత్మ విషయంలో ఏ విధంగా ఉండాలి? అనే విషయాన్ని సీత చరిత్ర ద్వారా మనకు మహర్షి నిరూపించి చూపించాడు. జీవుడు, భగవంతుడనే విషయంలో ప్రవేశించి, ఆ భగవంతుని ఆశ్రయించడం అనేది, భగవంతునిలో ఉండే కళ్యాణ గుణాలను చూచి కాదు. ఆత్మకు అతడు ప్రాప్త శేషి అనే అభిప్రాయంతోనే ఆశ్రయించాలి— అనే రహస్యమైన అర్థాన్ని పతివ్రతా స్త్రీ ఉండవలసిన స్థితిని చెప్పే వ్యాజంతో జీవాత్మ ఉండవలసిన స్థితిని మహర్షి ఉపదేశించాడు.

బాలకాండం చివరిలో శ్రీరామునకు, సీతాదేవికి మధ్య ఉండే అన్యోన్యానురాగం ఏ విధంగా ఉన్నది? అని మహర్షి నిరూపించే ప్రకరణంలో—

**"ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి,**
**గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతిః భూయోఽ భ్యవర్ధత,**
**తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే"**

అని నిరూపించాడు.

ఇక్కడ శ్రీరామునకు సీత విషయంలో ప్రీతి కలగడానికి "దారాః పితృకృతా ఇతి, గుణాత్, రూపగుణాచ్చాపి" అని మూడు కారణాలు చెప్పబడ్డాయి. మొదటి కారణం ఏమంటే, తన తండ్రి అయిన దశరథుడు వివాహం చేసిన కన్య అనేది. సీత విషయంలో ఉండే స్త్రీత్వలక్షణమైన దయ, అణకువ, సిగ్గు, దాక్షిణ్యం మొదలైన గుణ పూర్ణత్వం రెండవ కారణం, సీతయొక్క దేహసౌందర్యం మూడవ కారణం. అయితే, సీతాదేవికి శ్రీరాముని విషయంలో ఉండే ప్రీతికి ఏ కారణం చెప్పకుండా, "తస్యాశ్చ

భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే" అని సీతకు భర్త విషయంలో రెండింతలు ప్రీతి ఉన్నది— అని నిరూపించినందున, కేవలం భర్త అనే కారణంతోనే ఈ విధంగా రెండింతలు ప్రీతిని కలిగి ఉన్నది — అని మహర్షి అభిప్రాయం. శ్రీరాముని విషయంలో కూడా, పూర్వం ప్రస్తావించిన కారణాలు ఉన్నప్పటికీ, అవి ఆదరించదగినవి కాదు— అని మహర్షి అభిప్రాయం. ఇక్కడ, భర్త అనే ఆకారంతోనే ప్రీతి కలుగుతున్నది— అనే విషయాన్ని సీతాదేవి స్వయంగా అనసూయా దేవితో సంభాషించే సందర్భంలో వ్యక్తం చేసిన విషయాన్ని మహర్షి నిరూపించాడు. అత్రి భగవానుని ఆశ్రమంలో, ఆ మహర్షి పత్ని అయిన అనసూయా దేవి సీతను చూసి, "బంధుజనాన్ని అభిమానాన్ని ఐశ్వర్యాన్ని విడిచిపెట్టి భర్తతో అరణ్యానికి నీవు రావడం అనేది దైవయోగం చేత చక్కగా సమకూడింది. నగరంలో ఉన్నప్పటికీ, వనంలో ఉన్నప్పటికీ, మంచివాడైనా, చెడ్డవాడైనా, స్త్రీలకు భర్తయే దైవం. నీవు ఈ విధంగానే ఎల్లప్పుడూ రాముని విషయంలో అనుసరిస్తూ ఉండు" అని చెప్పింది. , సీతాదేవి ఈ మాటలను విని, సిగ్గుతో తన తలను వంచుకొని, "నాకు శ్రీరాముని విషయంలో నాకు గల దృఢమైన అనురాగం అనేది ఆ స్వామి గుణయోగాన్ని ఆశ్రయించి కాకుండా, స్వరూప నిబంధనంగా, స్వతః ఉన్నప్పటికీ, దానిని ఈ లోకంలోనివారు తెలియకుండా, శ్రీరాముడు గుణాధికుడై ఉండడం వల్ల, నాకు గుణనిబంధనమైన అనురాగమే ఏర్పడినది— అని భావిస్తున్నారు. కళ్యాణ గుణాలకు ఆకరమైన శ్రీరాముని, ఆ విధంగా ఉండే గుణాలనుండి విడదీసి చూపడానికి సాధ్యం కానందున, నాకు అతని విషయంలో ఉండే భావాన్ని లోకం తెలియజేయడానికి సాధ్యం కాలేదే. శ్రీరాముడు గుణహీనుడై, రూపం లేనివాడై ఉండి ఉన్నా, అప్పుడు కూడా, అతడు నాకు భర్త —అనే ఆకారంతో ప్రీతి కలిగే ఉంటుంది. "వేంబిన్ పుழு వేంబన్ఱి ఉణ్ణాదు" (పెరియ తిరుమొழி —11— 8 —7) (వేప చెట్టులోని పురుగు ఆ వేప చెట్టును తప్ప ఇంకొకటిని తినదు) అని, "కండార్ ఇకழ்వనవే కాదలన్ తాన్ శెయ్ దిడినుమ్ కొండానైయల్లాల్ అఱియా క్కులమగళ్ పోల్ "(చూచేవారు నిందించే కార్యాలను

చేసినప్పటికీ కూడా, తన భర్తను తప్ప ఇంకొక వ్యక్తిని తెలియని పతివ్రతవలె) (పెరుమాళ్ తిరుమొழி—5—2) అనే విధంగా ఉండేదానను నేను— అనే అర్థం వచ్చేటట్టుగా పలికింది. అందువల్ల జీవుడు భగవంతుని ఆశ్రయించేటప్పుడు, అతని విషయంలో ఉండే గుణాలను చూచి కాకుండా "అతడు స్వరూప ప్రాప్తమైనవాడు" అనే భావంతోనే ఆశ్రయించాలి— అనే రహస్యాన్ని ఇక్కడ మహర్షి వ్యక్తం చేశాడు.

(ఇది కేవలం మాట కాదు, వాస్తవమైన అభిప్రాయం అనేది లక్ష్మీదేవి రుక్మిణి దేవిగా అవతరించి, తాను శ్రీకృష్ణుని కోరిన ప్రకారాన్ని వ్యక్తం చేసే సప్త శ్లోకాలలోని మొదటి శ్లోకంలో "శ్రుత్వా గుణాన్ "అని వ్యక్తం చేయబడింది. "శ్రుత్వా గుణాన్"అనేది ఇక్కడ మొదటి యోజన. అది ఇక్కడ వివక్షితం కాదు. "శ్రుత్వా అగుణాన్" అనేది రెండవ యోజన. ఇక్కడ ఇది వివక్షితం. "నీవు బృందావనంలో గోపిక గోపికలతో విహరించిన రీతిని అంతా విని నా మనసు నిన్ను విడచి వేరొక చోటకు వెళ్లకుండా నీలోనే స్థిరమై నిలిచి ఉన్నది"— అని రుక్మిణీ దేవి అంటున్నది— అని ఇక్కడ భావం. దీని తాత్పర్యం ఏమంటే, "కడియన్ కొడియన్ నెడుమాల్ ఉలకమ్ కొండ అడియన్, ఆఴివరు మేని మాయత్తన్ ఆకిలుమ్ కొడియ ఎన్నెంజమ్ అవనెన్డే కిడక్కుమ్" (భక్తవ్యామోహం కల స్వామి కఠినుడు, క్రూరుడు, లోకాలను అన్నిటిని స్వాధీనం చేసుకున్నవాడు, తెలియడానికి సాధ్యం కాని మాయలను చేసేవాడు, అయినప్పటికీ, కఠినమైన నా మనసు అతని కోసమే మోహ పడుతున్నది) అని, "ఉందన్ మార్వు తழுవుదఱ్కు ఆశై ఇన్మై అఱిందఱిందే ఉన్ దన్ పొయ్యై క్కేట్టు" (నీ వచస్సును ఆలింగనం చేసుకోవడానికి ఆశలేని విషయాన్ని బాగా తెలి నప్పటికీ కూడా, నీ అబద్ధాలను విని నేను ఆశపడ్డాను) అని ఈ విధంగా భర్త ఎటువంటివాడైనా, పత్ని అతనినే ఆశపడాలి— అని తాత్పర్యం)

"భగవంతునకు జీవుడు శేషభూతుడు" అనే విషయాన్ని "ఏ భగవంతునకు నేను శేషమై ఉన్నానో, ఆ భగవంతుని విడచి ఇక ఎవరినీ నేను ఆశ్రయించను" అనే

అర్థం కలిగిన శ్రుతియొక్క అర్థాన్ని భరతుడు తన మాటలో వ్యక్తం చేశాడు. శ్రీరాముడు అరణ్యాలకు వెళ్లిన తరువాత దశరథుడు మరణించగా, "రాజ్యం అరాజకంగా ఉండకూడదు" అని భావించి, రాజ్యాన్ని స్వీకరించమని వశిష్ఠుడు మొదలైన మంత్రులు భరతుని ప్రార్థించారు. అప్పుడు అతడు సభా మద్యంలో ఆక్రందిస్తూ, ఆచార్యులైనందున పూజనీయులైన వశిష్ఠుని కూడా నిందిస్తూ,

"రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మిహార్హసి" ఈ రాజ్యం, నేను అనే రెండు రాముని సొత్తు. అంటే, వారికి శేషమై ఉండే వస్తువులం. శేషవస్తువైన ఒకటి ఇంకొక శేష వస్తువును పాలించగలదా? ఆ విధంగా అయితే, రాజ్యమే నన్ను పాలించనీ. లోకంలో రాజ్యం కోసం తండ్రిని, అన్నగారిని వధించేవారు ఉన్నారు. అయితే, పుత్రుని విడచి వెంటనే మరణాన్ని పొందే స్వభావాన్ని కలిగిన దశరథుని కడుపులో పుట్టిన నేను ఏ విధంగా రాజ్యాన్ని పాలించడం?" అని అన్నాడు భరతుడు.

ఈ విధంగానే శేషభూతుడైన జీవుడు తన శేషత్వానికి అనుగుణంగా కాలవిచ్ఛేదం లేకుండా వెంటనే ఉండేవాడై, ఏ అంతరాయం లేని సేవను చేయడం కూడా ఎవరికి?అంటే, కైంకర్య ప్రతిసంబంధి అయిన ఒక మిథునానికి, అంటే, దివ్య దంపతులకు –అనే విషయాన్ని లక్ష్మణుని ఆచరణలో కవి వ్యక్తం చేశాడు. "కోల త్తిరుమామగళోడు" (తిరువాయ్ మొழி– 6 –9 –3), "ఒండొడియాళ్ తిరుమగళుమ్ నీయుమే నిలా నిఱ్ప" (తిరువాయ్ మొழி– 4–9– 10) అని నమ్మాళ్వారులు అనుసంధించిన విధంగా ప్రాప్యం ఒక మిథునం అనే విషయాన్ని లక్ష్మణుడు కూడా,

**"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే**
**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"**
(రామాయణం– అయోధ్యకాండ– 31– 27)

(శ్రీరామా! నీవు సీతాదేవితో కలిసి పర్వత సానువులలో విహరిస్తావు. అప్పుడు, నీవు మేలుకొని ఉన్నప్పుడు, నిదురించేటప్పుడు అన్ని విధాలైన సేవలను చేస్తాను) అని శ్రీరాముడు, సీతాదేవితో కలిసి ఉండే చేరికలో కైంకర్యాన్ని చేయాలని ప్రార్థించి, దానిని పొందాడు. ఇది స్వరూప ప్రాప్తం. మిథున శేషత్వమే స్వరూపం అయితే, మిథునకైంకర్యం స్వరూపమే. అంటే, ఇద్దరికి, ఒకడు శేషం అయినప్పుడు, ఆ ఇద్దరికీ కూడా అతడు సేవను చేయవలసినవాడై ఉన్నవాడే కదా. తల్లిదండ్రులు ఇద్దరు కలసి ఉండే సన్నివేశంలో శుశ్రూషను చేసే పుత్రునకు వలె, తాను చేసే కైంకర్యం జీవునకు ఆనందాన్ని కలిగించడం కూడా లక్ష్మీదేవి, భగవంతుడు —అనే ఆ ఇద్దరి చేరికలోనే. అందుచేత ప్రత్యేకంగా, వీరికి, అంటే, ప్రత్యేకంగా భగవంతునికి, ప్రత్యేకంగా లక్ష్మీదేవికి ప్రాప్యత్వం అనేది లేదు. ఇద్దరినీ విడదీసి వేరువేరుగా అపేక్షిస్తే, రావణుడు, శూర్పణఖ మొదలైనవారికివలె, వినాశమే ఫలంగా సిద్ధిస్తుంది. కేవలం సీతాదేవిని కోరిన రావణుడు, శ్రీరాముని మాత్రమే కోరిన శూర్పణఖ నాశాన్ని పొందారు. ఇద్దరినీ ఆశ్రయిస్తే లక్ష్మణుని వలె ఉజ్జీవించి పోవచ్చు. "అల్లిమామలరాళ్ తన్నోడు మడియేన్ కండు కొండు అల్లల్ తీర్ న్దేన్" (పెరియ తిరుమొழி— 4—3— 6) (లక్ష్మీదేవితో కలిసి ఉండే స్వామిని దర్శించి, నా క్లేశాలను తీర్చుకున్నాను)అనే విధంగా ఇద్దరూ కలిసి ఉండే సన్నివేశంలో ఆశ్రయిస్తేనే ఉజ్జీవనం కలుగుతుంది— అనే విషయం ఇక్కడ తెలియజేయబడినట్లయినది.

భగవంతుని శ్రీచరణాలలో శరణాగతి చేసిన జ్ఞానులలో గొప్పవారైన ప్రపన్నులకు, ఉపాయంలో ప్రవృత్తి అనేది వారి అత్యంత పారతంత్ర్య స్వరూపానికి విరోధి. నివృత్తి అనేది రుచి విరోధి, ఈ రెండు అర్థాలకు ఉదాహరణంగా సీతాదేవి, లక్ష్మణుడు— అనే ఈ ఇద్దరినీ శ్రీవాల్మీకి మహర్షి ఉదాహరణగా చూపించారు.

లంకలోకి వచ్చి హనుమంతుడు, సీతాదేవి దగ్గర "నేను నిన్ను నా భుజాలపై మోసుకుని పోయి శ్రీరాముని దగ్గరకు తీసుకుని పోయి సమర్పిస్తాను" అని

చెప్పినప్పుడు సీతాదేవి, తనను తాను రక్షించుకోవడంలో శక్తిని కలిగినది అయినప్పటికీ, తన స్వరూపానికి తగిన తన పారతంత్ర్యాన్ని ఈ విధంగా వ్యక్తం చేసింది.

**"శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః,**
**మాం నయేద్యది కాకుత్స్థః తత్ తస్య సదృశం భవేత్"**
(రామాయణమ్ –సుందరకాండ– 39– 30)
(శత్రువులను సంహరించే స్వభావాన్ని కలిగిన శ్రీరాముడు తన బాణాలతో లంకను అంతటిని నిండించి, అక్కడనుండి నన్ను తీసుకుని పోతే, అది అతనికి తగిన పని అవుతుంది)

"లంకలో బాణాల గూడును కట్టి, శత్రువులను నశింపజేసి, శ్రీరాముడు నన్ను తీసుకొని పోయేవాడైతే, అది నా స్వరూపానికి, అతని స్వరూపానికి తగినది అవుతుంది. నేనే నన్ను రక్షించుకోవాలని ప్రయత్నం చేయడం, ఇతరులు ఎవరైనా నన్ను రక్షిస్తారా? అని ఎదురు చూడడం స్వరూప విరుద్ధం" అని సీతాదేవి చెప్పడం, దానిని ఆచరించి చూపించడం జీవునకు ఉపాయంలో ప్రవృత్తి అనేది స్వరూప విరుద్ధం– అనే విషయాన్ని చూపుతున్నది.

(ఈ విధంగా చెప్పడం అనేది, ప్రపత్తిని ఆచరించినవాడు ఈ ప్రపత్తి తనకు ఫలాన్ని ఇస్తుంది– అని భావించడం స్వరూప విరుద్ధం, ప్రపత్తి అనేది, నేను ఇది వరకు చేసిన పాపాలను పోగొట్టడం కోసమే. భగవంతుడు తన సహజమైన కారుణ్యంతో మోక్షాన్ని ఇస్తున్నాడు– అని భగవంతుడే ప్రధానమైన ఉపాయం –అని అనుసంధించాలి– అని తెలియజేయడంలో తాత్పర్యాన్ని కలిగినది. ఈ విధంగా కాకపోతే, ఉపాయానుష్ఠానమే సిద్ధించదు. కనుక, ప్రపన్నుడు అనే ఆకారం కూడా ఏర్పడదు. అందుచేత, స్వరూప విరుద్ధం అనేది సిద్ధించదు. ఆ విధంగానే, ఉపేయంలో

నివృత్తి అనేది రుచి విరోధి అనేదానికి కూడా ప్రమాణాలకు విరోధం లేకుండా అర్థాన్ని గ్రహించాలి. అంటే, ఈ జీవాత్మ భగవంతునకు శేషభూతుడుగానే ఉంటాడు కనుక, ఆ శేషత్వానికి ఉచితమైన కైంకర్యాన్ని ఇతడు స్వరూపం ఉన్నంతవరకు నిర్బంధంగా అయినా చేయాలి— అనే శాస్త్రార్థం ఇక్కడ చెప్పబడినది. ఆ విధంగానే, భగవంతుడు ఆజ్ఞాపించిన కైంకర్యాన్ని చేయడం మనకు కర్తవ్యం అనే అర్థాన్ని శ్రీభరతుడు తన అనుష్ఠానంతో తెలియజేశాడు. లక్ష్మణుడు కూడా, శేషి అభిలషించిన కైంకర్యానుష్ఠానంలోని ప్రాధాన్యాన్ని పాదుకగా అయోధ్యా నగరానికి తిరిగి వచ్చిన వృత్తాంతం ద్వారా తెలియజేశాడు. "ప్రార్థించదగిన, శేషికి అభిమతమైన కైంకర్యాన్ని లక్ష్మణుని యొక్క, ఇతని అవతారవిశేషమైన పాదుకావతారం యొక్క ప్రవృత్తినివృత్తుల ద్వారా గ్రహించాలి" అని రహస్యత్రయసారంలో ప్రధానప్రతితంత్రాధికారంలో శ్రీదేశికులు అనుగ్రహించిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. లక్ష్మణుడు, శ్రీరాముని నిర్బంధించి వనానికి వెళ్ళాడే తప్ప, అక్కడ అతడు చేసిన కైంకర్యం అంతా శ్రీరామునకు, సీతాదేవికి అభిమతమైనదే— అనేది ప్రసిద్ధం.)

శ్రీరాముడు అయోధ్యలో ఉండమని చెప్పినప్పటికీ, ఆ విధంగా ఉండకుండా, శ్రీరాముని విడచి ఒక్క క్షణం కూడా బ్రతికి ఉండడం తనకు సాధ్యం కాదని విషయాన్ని తెలియజేసి, ఆ శ్రీరాముని మాట కూడా మీరి, అరణ్యానికి శ్రీరామునితో వెళ్లి అక్కడ కైంకర్యాన్ని చేసిన లక్ష్మణుని అనుష్ఠానంలో "నాకించిత్ కుర్వతః శేషత్వమ్" (ఏ కార్యము చేయకుండా ఉండేవానికి శేషత్వం అనేది సిద్ధించదు)— అనే విధంగా ఉపేయంలో నివృత్తి అనేది కైంకర్య రుచికి విరోధి అని చూపబడినట్లయినది.

ఈ శ్రీరామాయణ కావ్యంలో సీతాదేవి మొదలైనవారి అనుష్ఠానం, అనుభవం మొదలైనవాటి వల్ల ఈ సంసారంలో ఉండే ఒక శ్రీవైష్ణవునకు కలగడానికి అవకాశం ఉండే అనేక అంతరాయాలు మొదలైనవి వ్యక్తం చేయబడ్డాయి. ఏ విధంగా? అంటే, లక్ష్మణుని విషయంలో సీతాదేవి పలికిన కఠినమైన మాటల ఫలంగా అప్పుడే

సీతాదేవికి శ్రీరాముని విడచి ఉండవలసిన స్థితి ఏర్పడిన వృత్తాంతం ద్వారా భాగవతాపచారంలోని క్రౌర్యం తెలియజేయబడింది.

సీతాదేవిని రావణుడు బలాత్కారంగా తీసికొనిపోయిన సమయంలో అతని చేతి స్పర్శ ఎంత అసహ్యంగా ఉన్నదో, ఆ విధంగానే ఈ దేహసంబంధం కూడా మనకు అంత అసహ్యంగా ఉండాలి— అనేది చూపబడింది.

సీతాదేవికి రాక్షస స్త్రీల పరుషభాషణలు మొదలైనవాటివలెనే, భార్యా పుత్రుల భాషణలు ఉంటాయి— అనే విషయం తెలియజేయబడింది.

మాయామృగమై తోచిన మారీచుడు సీతాదేవి మనస్సును ఆకర్షించి చాలా దూరం తీసుకొని పోయినట్లే, ఈ లోకంలోని శబ్దాది విషయాలు మనలను బలాత్కారంగా తమ వైపు ఆకర్షిస్తాయి—అనే విషయం చూపబడింది.

పది తలలను కల రావణుని దర్శనం ఏ విధంగా సీతాదేవికి సహించడానికి సాధ్యం కాకుండా ఉన్నదో, ఆ విధంగానే ఈ జీవునకు ఇంద్రియాల సన్నిధి ఉంటుంది— అనేది తెలుపబడింది.

హనుమంతుని రాకవలె ఆచార్యుని ప్రాప్తి ఉంటుంది— అని సూచింపబడింది.

ఈ విధంగానే, రామ గుణాలు సీతాదేవికి ఓదార్పును కలిగించేవిగా ఉన్నట్లే, ఆళ్వారుల సూక్తులు ఆశ్వాసకరంగా ఉంటాయి అని, శ్రీసుదర్శనంయొక్క, అంటే, రాముని నామాంకితమైన ఉంగరం యొక్క వృత్తాంతాన్ని హనుమంతుడు చెప్పినట్లుగానే, ఆచార్యుడు మనకు ఉపదేశించే గురుపరంపర ఉంటుంది అని, సుదర్శన ప్రాప్తివలె ఆచార్యునిచే ఉపదేశింపబడే తిరుమంత్రం ఉంటుంది అని, అశోకవనంలో సీతాదేవికి త్రిజట మొదలైన కొందరు సహాయంగా ఉన్నట్లే, ఇక్కడ ఈ జీవునకు శ్రీవైష్ణవుల సల్లాపం ఉంటుంది— అని, శ్రీరాముడు రావణ వధం చేసి

సీతాదేవిని తిరిగి తీసుకొని వచ్చినట్లే, ఈ జీవుని ప్రకృతి సంబంధాన్ని పోగొట్టి భగవంతుడు పరమ పదానికి తీసుకొని పోతాడు తెలుపబడినట్లు అయినది.

భాగవతాపచారంలోని క్రూరత్వం త్రిశంకు వృత్తాంతం ద్వా దృఢీకరించబడింది. అంటే, ఏ విధంగా త్రిశంకువు భాగవతాపచారం కారణంగా రూపుమాసిపోయి దగ్ధపటంవలె అయ్యాడో, ఆ విధంగానే ఈ జీవుడు కూడా అవుతాడు— అని సూచింపబడింది— అని భావం. తన శరీరంతో పాటు స్వర్గానికి పోవడానికి సాధనంగా ఒక యాగాన్ని జరిపించాలి అని తన కులగురువైన వశిష్టుని అతడు ప్రార్థించగా, ఆ మహర్షి అది సాధ్యం కాని పని అని చెప్పినప్పటికీ, దానిని వినకుండా, అతని పుత్రుల దగ్గరకు వెళ్లి ఆ విధంగానే ప్రార్థించాడు. వారు కూడా, వశిష్టమహర్షివలెనే "సాధ్యం కాని కార్యాన్ని చేయమంటే వీలవుతుందా?" అని అనగా, రాజు కోపాన్ని పొందినవాడై, "ఆచార్యులు అయిన వశిష్ఠుడు, వారి పుత్రులైన మీరు సాధ్యం కాదని అన్నారు కనుక, నేను ఇంకొకరి దగ్గరకు వెళ్లి నేను కోరుకున్న ఫలాన్ని పొందడం కోసం ప్రయత్నం చేస్తాను" అని చెప్పాడు. ఆచార్య పుత్రులు కూడా కోపించి "నీవు చండాలుడవు కాగలవు "అని శపించగా, అతడు కూడా వెంటనే పరమ ఛండాలుడైపోయాడు. అంతకుముందు బ్రహ్మవర్చస్సుకు లక్షణంగా ఉండే అతని యజ్ఞోపవీతం వెంటనే తోలుగా మారి పోయింది. (శాపం కనుక, వెంటనే ప్రత్యక్షంలో మారడం జరిగింది. మిగిలిన సందర్భాలలో ఈ విధంగా ప్రత్యక్షంగా ఏర్పడకపోయినా, శాపం ఏర్పడిన చోట ఈ విధంగా జరుగుతుంది— అనే సంగతి ఇక్కడ శాస్త్రబలం చేత తెలియదగినది).

"మద్భక్తాన్ శ్రోత్రియో నిందన్ సద్యః చండాలతాం వ్రజేత్" (నా భక్తులను నిందించినవాడు శ్రోత్రియుడైనా, అతడు వెంటనే చండాలుడు అవుతాడు) అని, "నుమర్ కళై పழிప్పురాకిల్ నొడిప్పదోళవిల్ ఆంగే అవర్ కళ్ తామ్ పులైయర్ పోలుమ్" (తిరుమాలై— 43) (నా భక్తులను ఎవరైనా నిందిస్తే క్షణకాలంలోనే వారు

అక్కడే చండాలురు అవుతారు) అనే ప్రమాణాలు చెప్పినట్లుగా కర్మఛండాలురు అవుతారు. జాతి ఛండాలునకు కాలాంతరంలో భాగవతుడుగా కావడానికి అవకాశం ఉన్నది, కానీ, కర్మచండాలునకు అది కూడా లేదు. తన ఆచార్యుడైన వశిష్ఠుని అనాదరించి, వారి అనుమతి లేకుండానే ఇంకొక ఆచార్యుని వరించడం అనేది త్రిశంకువునకు మహాపరాధం అయినది. దీని క్రౌర్యమే కదా, విశ్వామిత్రుని తపోబలం చేత శరీరంతో పాటు స్వర్గానికి వెళ్ళిన త్రిశంకువు ఇంద్రునిచే కిందకు గెంటి వేయబడడానికి, "త్రాహి, త్రాహి" — రక్షించు రక్షించు — అని ఆక్రందించడానికి, తిరిగి ఆ మునిచేత తన తపస్సు యొక్క మహిమతో ఒక నూతన స్వర్గం సృష్టింపబడినప్పటికీ, అందులో అతడు తలకిందుగా పడి ఉండడానికి కారణం అయినది. ఆ విధంగానే, పూర్వాచార్యులు కూడా" భగవంతుడు అవతరించి చేసిన అతిమానుష లీలలు అన్నీ భాగవతాపచారం సహించలేనందువల్లనే "అని అనుసంధించారు. మహర్షులైన భాగవతుల విషయంలో రావణుడు చేసిన అపచార ఫలంగా భగవంతుడు అవతరించి, అతనిని వధ చేసేటట్లుగా ఏర్పడింది. భగవంతుడు తన విషయంలో చేసిన అపచారాలను పెద్దగా లెక్కించడు, కానీ, ఎవరైనా తన భక్తుల విషయంలో చిన్న అపరాధం చేసినప్పటికీ, వారిని అతడు అప్పుడే దండించి తీరతాడు.

"త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ? "(రామాయణం— యుద్ధకాండం— 41—4) (సుగ్రీవా!, నీకు ఏదైనా ఆపద కలిగితే, ఇక నాకు సీతతో ఏమి పని?) శ్రీరాముడు భూమిపై నిలుచుని ఉండే సమయంలో లంకలో రావణుడు తన గోపుర శిఖరం పైకి వచ్చి కనిపించడం చూచి సహించలేని సుగ్రీవుడు, అతనిపై దూకి, అతనిని కిందకు పడగొట్టి, తిరిగి శ్రీరాముని దగ్గరకు వచ్చినప్పుడు, ఆ సుగ్రీవుని చూచి "నీవు మహారాజువు అనే గొప్పతనం అంతా పోయేటట్లుగా నిన్ను తిరస్కరించి ఆ రాక్షసాధముడు ఒక మాటను పలికితే, తరువాత, సీత నాకు ఎందుకు?" అని

శ్రీరాముడు అన్నాడు. భాగవతులకు ఒక హాని ఏర్పడినపుడు, తనకు అటువంటి హాని కలిగినప్పుడు ఏర్పడే కోపం కంటే, అధికమైన కోపాన్ని పొందుతాడు, భగవంతుడు.

తాను సముద్రరాజును శరణం పొందినప్పటికీ అతడు ముఖం చూపించకుండా ఉండగా, అతనిపై "కోపమ్ ఆహారయత్తీవ్రమ్" (తీవ్రమైన కోపాన్ని తనలో ఆరోపించుకున్నాడు) అనే విధంగా శ్రీరాముడు కోపాన్ని తనలో ఆరోపించుకున్నాడు. అయితే, తన భక్తుడైన హనుమంతుని బాధించిన రావణుని విషయంలో అయితే,

**"తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్,**
**దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశమేయివాన్"**
(రామాయణమ్ –యుద్ధకాండ –69 –136)
(అప్పుడు, గొప్ప తేజస్సును కలిగిన శ్రీరాముడు రావణుని చేత గాయపరచబడిన హనుమంతుని చూచి కోపానికి వశం అయ్యాడు) అనే విధంగా అవధి లేని కోపాన్ని పొందాడు.

### రాజధర్మవివరణమ్

ఈ కావ్యంలో పలు రాజధర్మాలు అక్కడక్కడ మనకు దర్శనమిస్తాయి. **"రాము రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి"** (రామాయణం –బాలకాండ– 1 –97) (శ్రీరాముడు రాజ్యాన్ని ఉపాసించి, బ్రహ్మలోకానికి వెళ్ళగలడు) అనే సందర్భంలో ఒక అందమైన, గంభీరమైన అర్థం ధ్వనిస్తున్నది. "ప్రజలు ఏ పాట్లైనా పడనీ! నాకేమీ పట్టింది? మనకు వచ్చే రాబడియే, అధికారమే మనకు కావలసినది. ప్రజలలో అసంతృప్తి కలిగి, వారు ఎదురు తిరిగితే, వారిని అధికారంతో అణచివేద్దాం" అని రాజ్యాన్ని పాలించే ప్రభువులవలె కాకుండా, శ్రీరాముడు తనను తక్కువవానినిగా, ప్రజలను ఉన్నతులుగా భావించి, ఒక ఉపాసకుడు తన ఉపాస్య దేవత విషయంలో ఏ విధంగా నడుచుకుంటాడో, ఆ విధంగానే రాజ్యాన్ని ఉపాసించాడు– అని

చెప్పినందున, రాజ్యంలో ఉండే జనాల ప్రీతియే లక్ష్యంగా కలిగినవాడై, వారి మనస్సు ఏమాత్రం బాధపడకుండా, వారికి కలలో కూడా హాని తలపెట్టకుండా, చేయకుండా రాజ్యాన్ని పాలించాడు —అని చెప్పబడింది.

## "లోకస్య చరతా హితమ్", "గుర్వోః ధర్మధురం వహన్"

"లోకం యొక్క క్షేమాన్ని రక్షిస్తూ, ప్రజాపాలనం అనే గొప్ప భాగ్యాన్ని వహిస్తూ వచ్చాను" అనే దశరథ చక్రవర్తి మాటలోకూడా ఇది వ్యక్తం చేయబడినది. అయోధ్యాకాండ నూరవ సర్గకు "కచ్చిత్ సర్గ" అని పేరు. అందులో, శ్రీరాముడు భరతుని ప్రశ్న చేసే వ్యాజంతో ఎన్నో రాజధర్మాలను విస్తృతంగా ప్రస్తావించాడు. యుద్ధకాండలో రావణుడు, రాముడు, ఈ ఇద్దరూ సభను చేయడం వ్యాజంగా చేసికొని, నీతి శాస్త్రాలలో చెప్పిన విధంగా సభను ఏర్పాటు చేసినట్లయితే, అది ప్రజలకు, ప్రభువుకు క్షేమాన్ని కలిగిస్తుంది— అని, దానికి విరుద్ధంగా సభను ఏర్పాటు చేస్తే ఫలం విపరీతంగా ఉంటుంది— అని చాలా చమత్కారంగా వ్యక్తం చేశారు. విభీషణుని శరణాగతి ప్రకరణంలో ఒక రాజు తన మంత్రులతో ఏ విధంగా మాట్లాడాలి? అనే విషయాన్ని శ్రీరాముడు వ్యక్తం చేశాడు.

★★★★

# పురుషకారతత్త్వమ్

(శ్రీమాన్ తిరుపుల్లాణి సుందరరాజన్ స్వామి ద్రావిడవ్యాసానికి అనువాదం)

లక్ష్మీదేవికి పురుషకారత్వం అనేది అసాధారణ ధర్మం. అంటే, ఆమెకు మాత్రమే చెందిన ధర్మం. పురుష కారం అంటే, పురుషుడు కానివానిని పురుషుడుగా చేయడం—అని అర్థం. పురుషుడు అంటే—సమృద్ధిగా ఇచ్చేవాడు అని అర్థం. దోషాలతో నిండినవాడైన చేతనుడు భగవంతుని ఆశ్రయించినప్పుడు, భగవంతుడు ఆ జీవుని దోషాలను చూచి, ఒకటికి పదింతలుగా భావించి, ఆ జీవునిపై కోపగించుకొని, అతనిని శిక్షించాలని అనుకుంటాడే తప్ప, అనుగ్రహించాలన అనుకోడు. అందుచేత, అపుడు భగవంతుడు అపురుషుడుగా అవుతున్నాడు. అప్పుడు లక్ష్మీదేవి ఆ స్వామికి దయ, వాత్సల్యం మొదలైన గుణాలు కలిగి ఉండడాన్ని తెలియజేసి, "లోకంలో ఎవరు తప్పు చేయరు ?"అని మొదలైన మాటలతో అతని కోపాన్ని ఉపశమింప చేసి, "జీవని విషయంలో మీరు మీవాత్సల్యం మొదలైన గుణాలను చూపించాలి" అనే ప్రార్థించి, ఆశ్రయించిన జీవుడు ప్రార్థించిన ఫలాన్ని భగవంతుడు మన పూర్వకంగా ఇచ్చేటట్లుగా చేస్తున్నది. ఈ విధంగా భగవంతుని లక్ష్మీదేవి తన దారిలోకి తీసుకుని వచ్చి, ఆశ్రయించిన భక్తుడు అడిగినదానిని సమృద్ధిగా ఇచ్చేటట్లు చేస్తున్నది కనుక, ఈమె పురుషకారస్వరూపిణి అవుతున్నది.

ఈ విషయాన్ని గూర్చి—

**"మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతాం మథ,**
**లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః,**
**మామాపి చ మతం హ్యేత న్నాన్యథా లక్షణం భవేత్"**

అని పాంచరాత్ర శాస్త్రంలో భగవంతుడే స్వయంగా ఈ విషయాన్ని తెలియజేశాడు. దీని అర్థం ఏమంటే, "సంసారంలో కిందకు పడిపోతున్న చేతనులు నన్ను పొందడానికి పురుషకారంగా లక్ష్మి ఉన్నది— అని మహర్షులచేత నిర్ణయింపబడింది. ఈ విషయం నాకు కూడా సమ్మతమే. పురుషకారత్వం అనే ధర్మం తప్ప ఆమెకు వేరు లక్షణం లేదు" అనేది ఈ శ్లోకాలలోని అర్థం.

లక్ష్మీదేవి కాకుండా ఉండే మిగిలిన దివ్యదేవేరులు, దివ్యసూరులు మొదలైన తదీయులకు ఈమె సంబంధం ద్వారా వచ్చే పురుషకారత్వమే ఉన్నది తప్ప, ఈమెకు ఉన్నట్లుగా సాక్షాత్ పురుషకారత్వం లేదు కదా.

అయితే, ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది. ఈ జీవునకు దివ్య దంపతులు ఇద్దరితో సమానమైన సంబంధం ఉండగా, ఇతడు భగవంతుని ఆశ్రయించడం కోసం పురుషకారంగా లక్ష్మీదేవిని ఆశ్రయించవలసి రావడం ఎందుకు? అనే క సందేహం ఇక్కడ ఏర్పడుతుంది. మాతృత్వ ప్రయుక్తమైన వాత్సల్యాతిశయంచేత లక్ష్మీదేవి, భగవంతుని వలె కాఠిన్యం, మార్ధవం అనే రెండిటిని కలిగి ఉండకుండా, కేవలం మార్దవ గుణాన్ని కలిగినదై ఉంటుంది. అందుచేత, ళఆమెకు జీవుని దోషాలను చూసి కోపం కలిగే అవకాశం లేదు. అంతే కాదు. విముఖులుగా ఉండేవారిని కూడా అభిముఖులుగా చేయడానికి కృషిని చేసే స్వభావాన్ని కలిగినది, ఈమె. దోషాలు కలిగినవారు కూడా ఏమీ జంకకుండా వచ్చి, ఆమె కాలిలో పడేటట్లుగా చాలా సౌలభ్యాన్ని కలిగినదై ఉంటుంది. పుంస్త్వప్రయుక్తమైన కాఠిన్యంతో, పితృత్వపుయుక్తమైన హితపరత్వంతో కూడినవాడై, జీవుని దోషాలను ఒకటికి పదింతలుగా లెక్కపెట్టి, కఠినమైన దండనాలను విధించేవాడు కనుక, దోషాలు కలిగిన జీవులు తన ముందుకు రావడానికి చాలా భయం కలిగేటట్లుగా ఉంటాడు. ఈ విధంగా ఉండే భగవంతుని తగిన ఉపాయాలతో జీవుని దోషాలను చూడకుండా

ఉండేటట్లు మరపింపచేసి, ఆ జీవుని, భగవంతుని కలిపేదై ఉన్నందున, అపరాధమే మూర్తీభవించిన ఈ చేతనుడు భగవంతుని ఆశ్రయించే సమయంలో లక్ష్మీదేవిని పురుషకారంగా చేసుకోవాలి. అందుచేతనే కదా, భగవంతుని ఉపాయంగా ఆశ్రయించే సమయంలో ఈమెను పురుషకారంగా పురస్కరించుకోవలసి ఉన్నది.

**"పురుషకారమాంబోదు కృపైయుమ్, పురుషకారత్వముమ్, అనన్యార్హత్వముమ్ వేణుమ్"** (శ్రీ వచన భూషణమ్—7)

అనేది శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన శ్రీసూక్తి.

ఇక్కడ "పురుషకారత్వమాంబోదు" అనేది పురుషకారం అయే సందర్భంలో— అని అర్థం. కృప అంటే, ఇతరుల దుఃఖాన్ని సహించ లేకుండా ఉండే స్వభావం. పారతంత్ర్యం అంటే, పరాధీనత్వం, అనన్యార్హత్వం అంటే, తద్వితిరిక్తవిషయార్హత్వం కాకపోవడం, అంటే, భగవంతునకు తప్ప ఇంకొకరికి తగినదిగా ఉండకపోవడం. ఇవి పురుషకారానికి చాలా ఆవశ్యకమైనవి— అని అనడంలో అర్థం ఏమి? అంటే, ఈ చేతనులు సంసారంలో పడే దుఃఖాన్ని చూచి సహించలేక, భగవంతునితో వీరిని చేర్చడానికి తగిన ప్రయత్నం చేయడానికి కృపాగుణం కావాలి. సర్వతంత్ర స్వతంత్రుడైన భగవంతుని వశీకరించేటప్పుడు, అనువర్తనంతో వశీకరించుకోవాలి కనుక, పారతంత్ర్యం కావాలి. "ఈ జీవుడు నాకు తప్ప వేరొకరికి అర్హం కాకుండా, నాకే అతిశయం కలిగించేదిగా ఉండే వస్తువు కనుక, ఇటువంటి ఈ జీవుని రక్షించమని లక్ష్మీదేవి చెబుతున్నది. కనుక, ఇతనిని రక్షించడం నా కార్యం కదా! ఇది" అని భగవంతుడు భావించేటట్లుగా అనన్యార్హత్వం ఉండాలి. అందుచేత, ఈ మూడు కూడా పురుషకారానికి చాలా ఆవశ్యకాలు కదా.

భగవంతుని కృప కంటే లక్ష్మీదేవి కృపకు ఉండే విశేషం ఏమి? అని అంటే, భగవంతుడు నిరంకుశస్వతంత్రుడై నిగ్రహానుగ్రహసమర్థుడై, చేతనుల కర్మలను వారు

తప్పక అనుభవించేటట్లు చేసేవాడు కనుక, అతని కృప స్వాతంత్ర్యంతో నియంత్రింపబడి, ఏవో కొన్ని సమయాలలోనే తల ఎత్తుతుంది. లక్ష్మీదేవి అయితే అనుగ్రహైక స్వభావాన్ని కలిగినది కనుక, ఈమె కృపకు వేరు దేనిచేత అభిభవం ఉండదు. అది ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. అందుచేత ఈమె కృప తీరాలను దాటి ప్రవహిస్తుంది. ఈ విధంగా ఉన్నందువల్లనే కదా, ఈమెను ఆశ్రయించేవారికి వేరొక పురుషకారం వెతుక్కోవలసిన అవసరం ఉండదు.

భగవంతుని విషయంలో లక్ష్మీదేవి కలిగి ఉండే పారతంత్ర్యం, అనన్యార్హత్వం—అనేవి స్వరూప ప్రయుక్తాలు మాత్రమే కాకుండా, స్వరూప నిరూపకత్వ సిద్ధమైన అనన్యత్వప్రయుక్తంగా ఉంటాయి. ఈ విధంగా ఉన్నందువల్లనే కదా, మిగిలినవారికి అందరికీ మిథునశేషత్వం, ఈమెకు మాత్రం తదేకశేషత్వం ఉన్నది.

ఈ విధంగా భగవంతునితో ఈమె అవ్యవధానంగా సంబంధాన్ని కలిగి ఉన్నందువల్లనే కదా, ఈమెకు ఈశ్వరుని వశీకరించుకునేటప్పుడు పురుషకారం ఇంకొకటి వెదుకవలసిన అవసరం లేదు.

ఈ కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం— అనే మూడు గుణాలను సీతాదేవి తన మూడు విశ్లేషాలద్వారా వ్యక్తం చేసింది.

“పిరాట్టి ముఙ్పడ పిరిందదు— తన్నుడైయ కృపైయై వెళియిడుక్కైక్కాక. నడువిల్ పిరిందదు —పారతంత్ర్యత్తై వెళియిడుక్కైకాక. అనంతరమ్ పిరిందదు— అనన్యార్హత్వత్తై వెళియిడుక్కైక్కాగ. “(సీతాదేవి మొట్టమొదట శ్రీరామునితో వియోగాన్ని పొందడం —తన కృపను వ్యక్తం చేయడం కోసం, రెండవసారి విశ్లేషాన్ని పొందడం —తన పారతంత్ర్యగుణాన్ని ప్రకటించడం కోసం, ఆ తరువాత విశ్లేషాన్ని పొందడం— తన అనన్యార్హత్వాన్ని వ్యక్తం చేయడం కోసం) (శ్రీవచనభూషణమ్—8)

ఈ విధంగా సీతావతారంలో ఈమె ఏర్పడిన మూడు విధాలైన వియోగాలకు హేతువులు ఇవి. ఈ గుణాలను ఈ విధంగా ప్రకటించడం కోసమే ఈమె ఈ మూడు వియోగాలను పొందినది ఈ విధంగా కాకపోతే, అనపాయినియై, అకర్మవశ్యయై ఉండే లక్ష్మీదేవికి కర్మవశ్యులకు వలె ఈ విధంగా వియోగాలు కలగడానికి యోగ్యత లేదు కదా. తన పురుషకారత్వానికి ఉపయోగించే గుణాలను, పురుషకారత్వాన్ని ప్రకటించడం కోసమే ఏర్పడిన అవతారం కదా, ఇది. అందుచేత, ఈ విధంగా జీవుల విషయంలో అనుగ్రహానికి అనుగుణంగా కృపను, ఈశ్వరుని సమీపించి, ఆ స్వామిని వశీకరించుకోవడానికి అనుగుణంగా పారతంత్ర్యగుణం మొదలైనవానిని సీతాదేవి తానే వ్యక్తం చేసింది. శాస్త్రాలలో వినబడే మార్దవగుణం మాత్రం కాకుండా, అది అనుష్ఠానపర్యంతంగా కనిపించినందువల్ల, ఈమె తనను పురుషకారంగా ఆశ్రయించేవారికి రుచి, విశ్వాసాలు కలుగుతాయి.

ఇటువంటి, విశిష్టమైన ఈమె పురుషకారత్వం ఎక్కడ కనబడుతున్నది?అని అంటే,

“సంశ్లేష —విశ్లేషంగళ్ ఇరండిలుమ్ పురుషకారత్వమ్ తో*ఱ్ఱు*మ్. “(శ్రీవచనభూషణమ్— 9) (సంశ్లేషంలోనూ, విశ్లేషంలోనూకూడా పురుషకారత్వం భాసిస్తున్నది)

అని దీనికి సమాధానం పలుకుతున్నారు, శ్రీపిళ్లైలోకాచార్యులవారు.

పురుషకారత్వం అంటే —ఘటతత్వం. ఇద్దరిని కలిపే స్వభావమే. ఆది, లక్ష్మీదేవికి, ఆమె భగవంతునితో కలసి ఉండే దశలోను, వియోగాన్ని పొందిన దశలో కూడా ప్రకాశిస్తున్నది— అని దీని భావం.

ఈ రెండు దశలలోను ఈమె పురుషకారాన్ని చేసే విధానం ఏమి? అనే విషయాన్ని, “సంశ్లేషదశైయిల్ ఈశ్వరనై తిరుత్తుమ్, విశ్లేషదశైయిల్ చేతననై

తిరుత్తుమ్" (సంశ్లేషదశలో భగవంతుని మారుస్తుంది, విశ్లేషదశలో జీవుని మారుస్తుంది) (శ్రీ వచనభూషణమ్ — 10) అని చెప్పబడింది.

ఈశ్వరుని మార్చడం అంటే— జీవుల అపరాధాన్ని గమనించి, "వీరి అపరాధాలను నేను క్షమించను" అనే భావించి ఉండే భగవంతుని దశను పోగొట్టి, అతడు తనను ఆశ్రయించిన జీవులను అంగీకరించేవానినిగా చేయడం. ఆ విధంగానే, జీవుని సంస్కరించడం అంటే, ఆకృత్య కరణం, కృత్యాకరణం మొదలైన అపచారాలను చేసేవాడై, భగవంతునకు విముఖుడై ఉండే చేతనుని ఆకారాన్ని మార్చి, అతడు భగవంతుని ఆశ్రయించటానికి సుముఖుడుగా అయ్యేటట్లు చేయడం.

లక్ష్మీదేవి భగవంతునకు చేసే ఉపదేశం ఏమంటే—

"ఈ చేతనుని అపరాధాలను లెక్కపెట్టి, మీరు ఈ విధంగా "ఇతనిని అంగీకరించను" అని గెంటివేస్తే, ఇతనికి ఇంకొక గతి ఏదైనా ఉన్నదా? ఈ జీవునకు, మీకు మధ్య ఉండే బంధవిశేషాన్ని చూస్తే, "ఉఱవేల్ నమక్కు ఇంగు ఒழிక్క ఒழிయాదు" (తిరుప్పావై —29) (మన మధ్య ఉండే సంబంధం పోగొట్టుకోవాలంటే సాధ్యం కానిది) అనే విధంగా ఘటశ్రాద్ధం చేసి పోగొట్టుకోవాలన్నా, పోనిది, అది. సొత్తు అయిన ఈ జీవుని పొందడం అనేది స్వామి అయిన మీకు ప్రాప్యం కదా. ఈ జీవుని వశీకరించుకోవాలని ఎదురు పన్నాగాన్ని చేస్తూ, అంటే, జీవుని కాపాడాలని అతనితో పాటు ఈ లోకంలో జన్మిస్తూ, ఉండే మీకు నేను చెప్పవలసిన ఆవశ్యకత ఉన్నదా?. మీ రక్షణను కోరుతూ మీ సాన్నిధ్యానికి వచ్చిన ఇతని రక్షించకపోతే, మీ సర్వరక్షకత్వం లేకుండా పోదా? అందుచేత ఇతనిని రక్షించాలి ""అని అంటుంది.

ఈ విధమైన ఉపదేశంతో లక్ష్మీదేవి భగవంతుని మనసును మారుస్తుంది.

ఇక, కృపతో జీవుని మనస్సును లక్ష్మీదేవి మార్చే విధానం ఏమంటే—

"నీ అపరాధబాహుళ్యాన్ని చూస్తే, నీవు ఎవరి దగ్గర కూడా కాలు మోపి నిలువలేవు. భగవంతుడు నిరంకుశస్వతంత్రుడు కనుక, అపరాధాలను ఒకటికి పదింతలుగా తలచి, తగిన దండనలను చేసేవాడు. ఈ అనర్థం నుంచి నీవు తప్పించుకోవాలంటే, నీవు ఆ స్వామి శ్రీచరణాలలో తలను మోపడం తప్ప, నీకు ఇంకొక గతి లేదు. సుమా! "అపరాధ పరిపూర్ణుని నన్ను అతడు ఏ విధంగా అంగీకరిస్తాడు? దండించడా?" అని నీవు భయపడవద్దు. ఆభిముఖ్యమాత్రంతోనే అన్ని అపరాధాలను సహించడానికి, అంత మాత్రమే కాక, వానిని భోగ్యంగా గ్రహించడానికి తగిన గుణాలతో నిండుగా ఉండే స్వామి, అతడు. ఈ విషయం లోక ప్రసిద్ధమై ఉన్నది. అందుచే, నీవు సుఖంగా ఉండాలి– అని అంటే, అతనిని ఆశయించు" అని ఉపదేశిస్తుంది.

ఈ విధమైన ఉపదేశంతో లక్ష్మీదేవి జీవుని సంస్కరిస్తుంది. ఈ విధంగా లక్ష్మీదేవి ఉపదేశించడాన్ని ఎక్కడ చూశాము? అని అంటే, పరమ పాపిష్ఠివాడై, దారి తప్పి ప్రవర్తించి మాట్లాడిన రావణుని ఉద్దేశించి "నీవు జీవించాలని అనుకుంటే, నీవు ఆ శ్రీరామచంద్రమూర్తితో సంబంధం తప్పక కలిగి ఉండాలి "అని భయపెట్టి ఉపదేశించింది కదా.

ఈ విధంగా లక్ష్మీదేవి చేసే ఉపదేశాలు భగవంతుడు, జీవుడు– అనే ఇద్దరి విషయంలోనూ ఏ విధంగా ఫలిస్తాయి– అనే విషయాన్ని శ్రీపిళ్లైలోకాచార్యులవారు శ్రీవచనభూషణగ్రంథంలో ఈ విధంగా తెలియజేశారు.

"ఉపదేశత్తాలే ఇరువరుడైయవుమ్ కర్మపారతంత్ర్యమ. కులైయుమ్" (లక్ష్మీదేవి చేసే ఉపదేశం వల్ల భగవంతుడు జీవుడు అనే ఇద్దరికీ కల కర్మపారతంత్ర్యం నశిస్తుంది) (శ్రీ వచన భూషణమ్ –12)

ఈ సూక్తి లోని భావం ఏమంటే– ఈ విధంగా ఇద్దరికీ వారి వారికి అనుగుణంగా ఈమె చేసే ఉపదేశంచేత పుణ్యపాపాల వశంలో చిక్కుకొని భగవంతుని

విషయంలో విముఖుడై ప్రవర్తించడం అనే చేతనుని కర్మపారతంత్ర్యం, జీవుడు చేసిన కర్మలను ప్రధానంగా చేసుకొని, "వాటికి అనుగుణంగా ఫలాన్ని ఇస్తాను, అంతే" అని ఇతని రక్షణలో విముఖుడై ఉండే భగవంతుని కర్మపారతంత్ర్యం నశిస్తాయి– అని భావం.

ఈ విధంగా తాను చేసే ఉపదేశం వల్ల ఇద్దరూ మారనప్పుడు, ఈమె మరి ఇక ఏమి చేస్తుంది? అని అంటే, దానికి బదులుగా శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ఏమన్నారంటే, "ఉపదేశకాలే మీళాదపోదు చేతననై అరుళాలే తిరుత్తుమ్, ఈశ్వరనై అழగాలే తిరుత్తుమ్. "(శ్రీ వచన భూషణమ్– 13) (తాను చేసే ఉపదేశం వల్ల జీవుడు, భగవంతుడు అనే ఈ ఇద్దరు మారకపోతే, జీవుని తన కృపతో అతని మనసును సంస్కరిస్తుంది, భగవంతుని తన అందంతో ఆకర్షించి, అతని మనసును మారుస్తుంది) అనే సూత్రం ద్వారా సమాధానం చెప్పారు.

ఈ విధంగా "పురుషకారమాంబోదు" అని ఆరంభించి 13వ చూర్ణిక వరకు ఉండే ఏడు సూత్రాల ద్వారా పురుషకారానికి ఉపయోగించే గుణవిశేషాలను, వాటిని లక్ష్మీదేవి ఏ విధంగా వ్యక్తం చేస్తుందో ఆ రీతిని, సంశ్లేషంలోనూ, విశ్లేషంలోనూ లక్ష్మీదేవి పురుష కారం చేసే ప్రకార విశేషాలను శ్రీపిళ్లై లోకాచార్యులవారు తెలియజేశారు.



## హనుమ ఆచార్యస్వరూపుడు

శ్రీరామాయణంలో హనుమంతుని పాత్ర చాలా విలక్షణమైనది. హనుమంతుడు శ్రీరామ భక్తుడు.

**యత్ర యత్ర రఘునాథ కీర్తనం**
**తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,**
**బాష్పవారి పరిపూర్ణ లోచనం**
**మారుతిం నమత రాక్షసాంతకమ్.**

ఎక్కడైతే శ్రీరామచంద్రుని సంకీర్తన జరుగుతుందో, అక్కడ అంజలిని ఘటించి, ఆనంద బాష్పాలను విడుస్తూ, హనుమంతుడు సంచరిస్తాడు. ఇతడు సుగ్రీవుని సచివుడు. నూరు యోజనాల నిడివిని గల సముద్రాన్ని దాటాడు. లంకలో ఉండే సీతను వెదకి చూచి, అక్షయ కుమారుడు మొదలైన రాక్షసులను సంహరించి, రావణ సభలో ఎటువంటి భయం లేనివాడై దౌత్యాన్ని నిర్వహించాడు. రామపరాక్రమాన్ని

**"బ్రహ్మా స్వయంభూః చతురాననో వా**
**రుద్రః త్రినేత్రః త్రిపురాంతకో వా,**
**ఇంద్రో మహేంద్రః సురనాయకో వా**
**త్రాతుం సమర్థా యుధి రామవధ్యమ్"**

అని వర్ణించాడు.

**"మనోజవం మారుత తుల్య వేగం**
**జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,**
**వాతాత్మజం వానరయూధ ముఖ్యం**
**శ్రీరామదూతం శిరసా నమామి"**

అనే విధంగా ఇతడు బుద్ధిమంతుడు, జితేంద్రయుడు —అని ఇంతవరకు అందరికీ సామాన్యంగా తెలిసిన విషయం.

శ్రీరామాయణంలో హనుమంతుని పాత్ర "పరిచితమివ, అథాపి గహనమ్" అనే విధంగా చాలా ముఖ్యమైనది, తెలిసినట్లే ఉంటుంది గాని, అర్థం చేసుకోవడానికి చాలా కష్టమైనది.

హనుమంతుడు ఆచార్యుడు, అనగా, గురువు. నవవ్యాకరణ వేత్త. పరమార్థ తత్వాన్ని గ్రహించినవాడు. వేదాంతదేశికులవారు సంకల్ప సూర్యోదయం అనే నాటకంలో.

**దర్పోదగ్ర దశేంద్రియాననమనో నక్తంచరాధిష్ఠితే**
**దేహే ఽ స్మిన్ భవసింధునా పరిగతే దీనాం దశా మాస్థితః,**
**అద్యత్వే హనుమత్సమేన గురుణా సంబోధితార్థః సుధీః"**
**అనే శ్లోకంలో హనుమంతుని ఆచార్య స్థానంలో నిలిపి పలికారు.**

లంకలో నిర్బంధింపబడిన సీత రావణుని పరిజనమైన రాక్షస స్త్రీల చేత భాధ పెట్టబడి, రావణుని చేత తర్జనభర్జనలను పొందుతూ, శ్రీరామచంద్రుడని ఉనికిని తెలియక, బాధపడి, చివరకు హనుమంతుని వలన రాముని వృత్తాంతాన్ని విని, రామప్రాప్తి కలుగుతుందనే సంతోషాన్ని పొంది, ప్రాణధారణను చేసినది. ఆ విధంగానే, జీవుడు సంసార సాగరంలో పడి ఉండి, ప్రబలమైన మనస్సు యొక్క అధికారంచేత కు విజృంభించిన పది బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలకు వశమై, హనుమంతునితో సమానుడైన ఆచార్యుని వల్ల సర్వేశ్వరులకు సంబంధించిన జ్ఞానాన్ని పొంది, ఊరటను చెంది, ఆ పరమేశ్వరుని ప్రాప్తి కోసం నిరీక్షిస్తాడని పై శ్లోకంలోని తాత్పర్యం.

వాల్మీకి మహర్షి లంకలో సీతాసన్నివేశాన్ని వర్ణిస్తూ, పై శ్లోకంలోని ప్రథమ పాదార్థాన్ని

**సా రాక్షసీ మధ్యగతా చ భీరుః**
**వాగ్భిః భృశం రావణతర్జితా చ,**
**కాంతారమధ్య విజనే విసృష్టా**
**బాలేవ కన్యా విలలాప సీతా"**

అని వర్ణించాడు. మొట్టమొదటిసారిగా సుగ్రీవుని చేత రామలక్ష్మణుల వివరాలను తెలుసుకొని రావాలని ఆజ్ఞాపింపబడిన హనుమంతుడు

**"కపిరూపం పరిత్యజ్య హనుమాన్ మారుతాత్మజః,**
**భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః"**
**"తతః స హనుమాన్ వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా,**
**వినీతవదుపాగమ్య రాఘవౌ ప్రణిపత్య చ"**

అని చెప్పిన రీతిలో తన స్వరూపాన్ని మరుగుపరచి భిక్షరూపాన్ని ధరించి రామలక్ష్మణుల వివరాలు తెలుసుకోవాలని వెళ్ళాడు శ్రీరామచంద్రుని, లక్ష్మణసహితంగా చూసిన వెంటనే అతని జ్ఞాననేత్రం వికసించినది. తాను యతివేషంలో ఉన్నప్పటికీ, శ్రీరామునకు నమస్కారాన్ని చేస్తాడు.

"ఉభౌ యోగ్యా వహం మన్యే రక్షితుం పృథివీమిమామ్,
ససాగరవనాం కృత్స్నాం వింధ్యమేరువిభూషితామ్"
అని ఋగ్వేద ప్రతిపాదితమైన సృష్టి స్థితి సంహారకత్వాన్ని,
"అజాయమానో బహుధా విజాయతే"
అని యజుర్వేదంలో ప్రతిపాదింపబడిన విషయాన్ని

"విశాలవక్షసౌ వీరౌ మానుషౌ దేవరూపిణౌ" అనే శ్లోకం ద్వారా,

"అథ య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" అను సాంబవేద ప్రతిపాదితార్థాన్ని

"ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః"

అంటూ ఆభరణాల చేత మరగుపరచదగిన దివ్యమంగళ రూపాన్ని ఈ విధంగా వ్యక్తం చేస్తే దృష్టిదోషం తగులుతుందే! అని భయపడతి, తన భగవన్మంగళాశాసన పరత్వాన్ని వ్యక్తం చేస్తాడు. ఆభరణాలకే అందాన్ని ఇచ్చే రూపాన్ని కలిగినవాడు కనుక, ఆభరణాలకు సౌందర్యాన్ని కలిగించే దివ్యమంగళ రూపానికి దృష్టిదోషం తగలకుండా అడ్డుగా ఉండవలసిన ఆభరణాలను ఎందుకు ధరించలేదు? అని ప్రశ్నిస్తాడు.

**"ప్రాప్తోహం ప్రేషిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా,**
**రాజ్ఞా వానరముఖ్యానాం హనుమాన్ నామ వానరః"**
**"భిక్షురూపప్రతిచ్ఛన్నం సుగ్రీవప్రియకామ్యయా,**
**ఋష్యమూకాదిహ ప్రాప్తం కామగం కామరూపిణమ్"**

అని తన వృత్తాంతాన్ని తెలియజేశాడు. శ్రీరామచంద్రదర్శనంతో "ఛిద్యంతే సర్వసంశయాః "అనే విధంగా అన్ని విధాలైన సందేహాలు తీరిపోగా యథార్థ స్థితిలో తనను తెలియజేసుకుంటాడు.

అయితే, ఇక్కడ ఒక విశేషం ఉన్నది. సంక్షేప రామాయణంలో

"గంగాతీరే హనుమతా సంగతో వానరేణ హ" అని అంటూ స్వస్వరూపంతోనే హనుమంతుడు రామలక్ష్మణులను సమీపించి సంభాషించాడని కనిపిస్తున్నది. ఇక్కడ "వానరేణేతి విశేషణేన రావణవత్ సన్యాసివేషరహితతయా

స్వవేషేణ సమాగమాత్ విశ్వసనీయతా ద్యోతతే” అని గోవిందరాజీయ వ్యాఖ్యానం. బహుశా గోవిందరాజులవారు నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఆరవ శతక ప్రారంభంలోని “వైకల్ పూమ్ కళివాయ్” అనే పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై అనే ఆచార్యులు చేసిన వ్యాఖ్యానాన్ని దృష్టిలో పెట్టుకొని ఇక్కడ “ద్యోతతే “అని చెప్పి ఉండవచ్చు అని పెద్దల అభిప్రాయం. కానీ, “కాపిరూపం పరిత్యజ్య” అని, “భిక్షురూపం తతో భేజే” అని స్పష్టంగా వాక్యాలు ఉన్నందువల్ల నంబిళ్ళై వ్యాఖ్యానపంక్తిని అన్యథా స్వీకరించి ఉంటారనేది నిస్సందేహం. “(వానరేణ)— సన్యాసివేషమ్ కొండువందు, పిరివై విళైత్తు నలివు పణ్ణుమవనై ప్పోలన్ఱిక్కే, శెవ్వియవనోడే శేరప్పెరువదే” (సన్యాసి వేషాన్ని వేసుకుని వచ్చి, విశ్లేషాన్ని కలుగజేసి, బాధ పెట్టే వానివలె కాకుండా, ఋదువుగా ఉండేవానితో చేరగలిగాడు కదా) అనేది నంబిళ్ళై శ్రీసూక్తి. సన్యాసి వేషంతో దివ్య దంపతులకు విశ్లేషాన్ని కల్పించే దుర్బుద్ధితో వచ్చిన రావణునివలె, కాకుండా, దివ్య దంపతులకు సంశ్లేషాన్ని కలిగించేవాడై, సుగ్రీవునితో స్నేహానికి కూడా కారణభూతమైన సన్యాసివేషంతో వచ్చాడు అని రావణబుద్ధితో వ్యావృత్తి తోచే విధంగా, హనుమత్సంగమం సీతా వియోగానికి ఆశ్వాసాన్ని కలిగించే హేతువైనందున, ఋషి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ “హ “అని అన్నాడు. ఆళ్వారుల హృదయాన్ని గ్రహించి పూర్వాచార్యులు చేసిన వ్యాఖ్యానాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం.

హనుమంతుడు అద్వితీయ పండితుడని, ఘటక కృత్యానికి తగినవాడని తెలుసుకొని లక్ష్మణుతో ఈ విధంగా శ్రీరామచంద్రుడు అన్నాడు.

**“నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః,**
**న సామవేదవిదుషో శక్యమేవం ప్రభాషితుమ్”,**
**“నూనం వ్యాకరణంకృత్స్నమనేన బహుధా శ్రుతమ్,**
**బహు వ్యాహరతానేన న కించిదపశబ్దితమ్,”**

**“అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతమ్,**
**ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే”.**

ఋగ్వేదాన్ని తెలియనివాడు ఈ విధంగా మాట్లాడలేడు. యజుర్వేదాన్ని తెలియనివాడు ఈ రీతిలో పలుకలేడు. సామవేదాన్ని తెలియనివాడు ఈ విధంగా మాట్లాడలేడు. ఇంతే కాదు, ఇతడు పూర్తిగా వ్యాకరణాన్ని చదివినవాడు గాను, అనేక మంది వల్ల అనేక విషయాలు తెలిసినవాడుగాను కనబడుతున్నాడు. అందుచేతనే ఇతడు ఇంత మాట్లాడినా, కొంచెం కూడా ఇతని మాటలలో అపశబ్దం పలుకలేదు. అందుచేత ఇతనికి నీవు జాగ్రత్తతో మన విషయాలన్నిటిని చెప్పు సుమా!” అని లక్ష్మణునితో శ్రీరాముడు అన్నాడు. ఈ విధంగా తెలుసుకున్నవాడు కనుకనే, సీతను వెతకడం కోసం హనుమంతుడు వెళ్లేటప్పుడు అంగదుడు, జాంబవంతుడు మొదలైన ఎంతోమంది వానరులు ఉన్నప్పటికీ కూడా, హనుమంతునకే తన ముద్రికను ఇచ్చి రాముడు పంపించాడు. ఈ ఘటక కృత్యానికి హనుమంతుడే తగినవాడని భావించాడు. దీనినిబట్టి ఘటకకృత్యాన్నే స్వభావంగా గల ఆచార్యత్వపూర్తి హనుమంతునిలోనే ఉందని తెలుస్తున్నది.

“ఏవం సత్సంతానప్రసూత సదాచార్యనిరత ఆత్మగుణోపేత వేదవిదాచార్యోపసతవ్యః” అని ఆచార్య లక్షణం నిర్వచించబడింది. పెద్దలు, మహర్షులు కూడా.

“ఆచినోతి హి శాస్త్రార్థాన్ ఆచారే స్థాపయత్యపి, స్వయమాచరతే యస్మాత్ తస్మాదాచార్య ఉచ్యతే”,

**“ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః,**
**మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయః శుచిః,**
**గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః,**

**ఏవం లక్షణసంపన్నో గురురిత్యభిధీయతే"**

**"గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్దః తన్నిరోధకః,**

**అంధకారనిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే".**

"అజ్ఞాననివర్తనశీలో గురుః". జీవులలో మరగు పడి ఉండే యథార్థమైన సంబంధ జ్ఞానాన్ని జ్ఞాపకం చేసి, సర్వేశ్వర ప్రాప్తిని కలగజేయడమే ఘటక కృత్యం. ఆ పనిని చేసేవాడే ఆచార్యుడు.

**"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః,**

**తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః"**

అనే విధంగా జ్ఞానం, కర్మ అనే ఈ రెండిటిని రెక్కలుగా కలిగిన పక్షులే ఆచార్యులు. వీరు పురుషోత్తమప్రాప్తికి కారణభూతులు. ఈశ్వర సంబంధం కంటే ఆచార్య సంబంధం ప్రధానమైనది అని సకల శాస్త్ర నిర్ణయం. ఈశ్వర సంబంధం అనేది బంధానికి, మోక్షానికి —ఈ రెండిటికి హేతువుగా ఉంటుంది. ఆచార్య సంబంధం అయితే, కేవలం మోక్షానికి మాత్రమే హేతువై ఉంటుంది. శాస్త్ర మర్యాదన అనుసరించి ఈశ్వరుడు స్వతంత్రుడు కనుక, అతడు "న క్షమామి" అని తప్పులు చేసిన జీవుని చూసి, "నేను క్షమించను "అని అనవచ్చును. ఆచార్యులకు— మోక్ష ప్రాప్తికై భగవంతుని ప్రార్థించడం, శిష్యునకు అజ్ఞాత జ్ఞాపనాన్ని చేయడమే కృత్యం కనుక, ఆచార్య సమాశ్రయణం మోక్షఫలప్రాప్తికి చాలా ముఖ్యం. "స్వాభిమానత్తాలే ఈశ్వరాభిమానత్తై కులైత్తుక్కొండ ఇవనుక్కు ఆచార్యాభిమానమ్ ఒழియ గతి ఇల్లై" (స్వాభిమానంతో ఈశ్వరుని అనుగ్రహాన్ని లేకుండా చేసుకొన్న ఈ జీవునకు ఆచార్యాభిమానం తప్ప వేరే గతి తరించడానికి లేదు) అనేది శ్రీవచనభూషణ దివ్యసూక్తి. తన దురభిమానంతో ఈశ్వరానుగ్రహాన్ని కోల్పోయినవానికి ఆచార్యాభిమానం తప్ప వేరు గతి లేదు అనేది నిశ్చయం. "పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా" అని యామునులు పలికిన విధంగా,

దోషంతో నిండినవానికి ఆచార్యుని ద్వారా భగవంతుని ప్రాప్తి కలుగుతుంది తప్ప, ఇంకొక దారి లేదు— అనేది సిద్ధాంతం.

ప్రకృతివాసనాబలంచేత జీవాత్మ, భగవత్సంబంధం జ్ఞానాన్ని మరచిపోయి, భగవంతునకు దూరమై, సాంసారిక శరీరంలో పడి ఉండి, బాధపడుతూ అలమటిస్తూ, కొంతకాలానికి సదాచార్యోపదేశంచేత భగవంతుని పొందుతున్నాడు. ఆ విధంగానే, శ్రీరామాయణంలో— సీత అనే జీవుడు — దివ్యమంగళ విగ్రహస్వరూపుడు, సమస్త కళ్యాణ గుణపూర్ణుడు అయిన శ్రీరామచంద్రుడు తనకు సన్నిహితుడై, సర్వవిధఫల ప్రదాతయై ఉన్నప్పటికీ కూడా, ప్రకృతిసంబంధ రూపమైన మాయలేడి పై దృష్టిని పొంది, దానిని ఆశపడినందున, వెంటనే భగవంతునకు దూరమైనది. ఆ తరువాత లంక అనే సాంసారిక శరీరప్రవేశాన్ని, ఏకాక్షి, ఏకకర్ణిక మొదలైన 700 మంది రాక్షస స్త్రీలచేత తర్జనభర్జనలను పొందింది. రావణాసురునిచేత బాధలు పడడం జరిగింది.

ఆ సమయంలో, భగవానుడైన శ్రీరామచంద్రుని చేత నియోగింపబడినవాడు, సమస్తము తెలిసినవాడు అయిన హనుమంతుడు దూతగా వచ్చి, "సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ "అనే విధంగా శ్రీరామచంద్రుని క్షేమసమాచారాన్ని సీతకు తెలియజేసి, ఆమె ఉనికిని యథాతథంగా శ్రీరామచంద్రునకు విశదపరచి, ఘటక కృత్యం అయిన ఆచార్య పదవిని చాలా సమర్థవంతంగా నిర్వహించాడు. దీనిని అంతటినీ మనం సుందరకాండలో గమనించవచ్చు.

హనుమంతునకు సంబంధించిన కుష్కిందాకాండలో పంచాంగా మాత్రమే గోచరిస్తుంది. అక్కడ, అతడు పండితుడని, సుగ్రీవునకు మంత్రి అని మాత్రమే మనకు స్పష్టంగా కనిపిస్తుంది. హనుమంతుని స్వరూపం సుందరకాండలో పరిపూర్ణతను పొందింది. హనుమంతుని ఆచార్యత్వపూర్తికి తగినట్లుగా, సందేహ సమయంలో వివేక

నిర్ణయం, సంభాషణలో ఔచిత్యం, కార్యాచరణలో సామర్థ్యం, ధీరత్వం ఈ కాండలో ప్రదర్శింపబడింది.

మిగిలిన అన్ని కాండలకు ఆయా సన్నివేశాలనుబట్టి పేర్లను పెట్టిన వాల్మీకి మహర్షి ఈ కాండకు సుందరకాండ అనే పేరును పెట్టడంలో ఏమి కారణం? అని గమనిస్తే, పైకి కనపడేది—ఈ కావ్యంలోని నాయికానాయకులైన సీతాశ్రీరామచంద్రుల సౌందర్యాన్ని వర్ణించడం ఒక కారణంగా గోచరిస్తుంది. శ్రీరామచంద్రుని సౌందర్యాన్ని గూర్చి వర్ణించేటప్పుడు, శాస్త్ర ప్రకారం, సాముద్రిక శాస్త్రాన్ని అనుసరించి శ్రీరామచంద్రుని దేహ సౌష్ఠవాదులను, గుణాలను వర్ణించి సీతాదేవికి చెప్పి, హనుమంతుడు నమ్మకాన్ని కలుగజేశాడు— అనేది రెండవ సమర్థనం. ఈ కావ్యంలో నాయకుని పూర్తి సౌందర్యాన్ని వర్ణించిన ఘట్టం ఈ సన్నివేశంలోనే కనబడుతుంది.

అయితే, ఈ కావ్యానికి నాయిక అయిన సీతా సౌందర్యాన్ని ఈ కాండలో వాల్మీకి ఏ విధంగా వర్ణించాడు? అనేది విచారించవలసిన విషయం. స్త్రీలకు ఆభరణాలు మొదలైన వాని వల్ల కలిగే సౌందర్యం కానీ, శరీర సౌష్ఠవం వల్ల కలిగే సౌందర్యం కానీ సౌందర్యం కాదు. స్త్రీలకు శీలగుణ ప్రధానమైన పాతివ్రత్యమే సౌందర్యం. ఈ సుందరకాండలో సీతాదేవికి కల బాహ్యసౌందర్యంతో పాటు అంతః సౌందర్యం కూడా హనుమంతుని చేత వర్ణితమైనది. శ్రీరామచంద్రుని విరహావస్థను చూచి, క్షత్రియుడు, చక్రవర్తికి కుమారుడై ఉండి, స్త్రీ విషయంలో ఇంతగా శ్రీరాముడు విలపిస్తున్నాడే! అనే సందేహాన్ని మొదట హనుమంతుడు పొందాడు. అయితే, ఆ సందేహం సీతను చూసిన తరువాత పూర్తిగా తీరిపోయింది. "రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా, త్రైలైక్యరాజ్యం సకలం సీతాయాః నాప్నుయాత్ కలామ్" అని త్రైలోక్యరాజ్యమే కాదు సకల శబ్దవాచుడైన శ్రీరామచంద్రుని ఉంచినా అది కళా మాత్రమే అవుతుంది— అని అన్నాడు.

"సా రాక్షసీనామ్ ప్రవరేణ జానకీ స్వశీలసంరక్షణతత్పరా సతీ" అని తన శీలాన్ని రక్షించుకోవడంలో ఆసక్తురాలు అయిన సీతను చూచి హనుమంతుడు ఇంకా చాలా దూరం ఆలోచించాడు. "దుష్కరం కృతవాన్ రామో హీనో యదనయా ప్రభుః, ధారయత్యాత్మనో దేహం న దుఃఖేనావసీదతి" అని అంటూ సీత అత్యంత పారతంత్ర్యస్వరూపురాలు, "తత్తస్య సదృశం భవేత్" అని ఉండదగినది. అందువల్లనే ప్రాణత్యాగానికి ఆమెకు అధికారం లేదు. శ్రీరామచంద్రుడు సర్వతంత్ర స్వతంత్రుడు. ఇట్టి రూప సంపదను కలిగినటువంటి, ఇంతటి శీలవతి అయిన సీతను విడచి ఏ విధంగా ప్రాణదారణను చేస్తున్నాడు? అనే సందేహాన్ని కూడా పొందాడు. ఈ విధంగా నాయికా నాయకుల వాస్తవికమైన సౌందర్యం వర్ణింపబడింది కనుకనే, దీనికి వాల్మీకి సుందరకాండ అని నామకరణాన్ని వాల్మీకి మహర్షి చేశాడు. ఈ కాండలో ఉన్నంత ద్రాక్షాపాకం ఇక ఏ కాండలోనూ కనిపించదు. ఇది కూడా ఒక కారణం కావచ్చు.

ఇక మూడవది తత్వార్థం. విశ్లేషాన్ని పొందిన సీతారాములు అనే దివ్యదంపతులను ఒకటిగా చేర్చడం అనే ఘటకృత్యాన్ని చేయడానికి ఆరంభించిన, అతిసుందరమైన సన్నివేశాలతో కూడిన హనుమదాచార్యుని ప్రతిభావిశేషాన్ని వ్యక్తం చేస్తున్నది కనుకనే, దీనికి వాల్మీకి సుందరకాండ అని నామకరణం చేశాడు— అని భావించవచ్చు.

హనుమంతుడు సముద్రాన్ని లంఘించి, లంకలో ప్రవేశించి, సూక్ష్మ రూపాన్ని ధరించి, "చతురంగులళ మాత్రో ఽ పి నావకాశః స విద్యతే" అనే విధంగా రావణాంతఃతపురాన్ని అంతటినీ వెదకి, సీతను చూడలేక, విచారాన్ని పొందుతాడు. రాత్రివేళలో స్త్రీపురుష సంభోగ దశలు సైతం అతని దృష్టికి గోచరించినా అతని మనసు చలించలేదు. "పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్, ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి" అని, "కామం దృష్టా మయా సర్వాః విశ్వస్తా రావణస్త్రియః, ""న

హి మే మనసః కించిత్ వైకృత్యముపపద్యతే” అని ఈ విధంగా తన మనోదార్ఢ్యాన్ని గురించి ఆలోచిస్తాడు. అందువల్లనే విరక్తులను గురించి చెప్పేటప్పుడు “అన్యత్ర భీష్మా ద్గాంగేయా దన్యత్ర చ హనూమతః”, అని అన్నారు. ఇది ఆచార్యునకు ఉండవలసిన విషయ వైరాగ్యాన్ని సూచిస్తుంది.

సీతను చూడకుండా తాను తిరిగి వెళితే ఏర్పడే అనర్థాలను గూర్చి అతడు ఆలోచిస్తాడు. సీత కనిపించే వరకు లంకలో అంతా మళ్లీ మళ్లీ గాలిస్తాను– అని అంటాడు. “సంపాతి, సీత లంకలోనే ఉన్నదని చెప్పినాడే! అది అసత్యవాక్యం కాదు కదా! “అని సందేహ పడతాడు. ఇంతలో అశోకవనం అతనికి గోచరమవుతుంది. శ్రీరామచంద్రుని, సీతను, లక్ష్మణుని తలచుకొని, భక్తితో నమస్కృతులు చేసి, అశోకవనికలో ప్రవేశించి, అక్కడ సీతను చూస్తాడు. ఆమెను చూసి చాలా సంతోషాన్ని, విచారాన్ని కూడా పొందుతాడు.

ఇక్కడ అతడు సీతను వర్ణించిన వర్ణన చాలా అనురూపమైన వర్ణన. ఇక్కడ ఒక్కొక్క ఉపమానం అద్భుతమైనది. చదువుచున్న కొద్దీ సజీవమైన సీతాస్వరూపం మన కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. 15వ సర్గలో 27వ శ్లోకం మొదలు 55వ శ్లోకం వరకు సీతాస్వరూపవర్ణన చేయబడినట్లుగా, ఇంకెక్కడా, అంటే, శ్రీరామాయణంలో ఇంకొక చోట ఎక్కడా చేయబడినట్లు మనకు కనిపించదు.

ఇంతలో రావణాసురుడు ఆక్కడకు వచ్చి ఆమెను బెదిరించి, ఆమెచేత నిరసింపబడినవాడై, కోపోద్రిక్తుడై వెళ్ళిపోతాడు. రాక్షసకాంతలు క్రూరమైన వాక్యాలతో సీతను చాలా బాధ పెడతారు. దీనిని అంతటిని గమనించి హనుమంతుడు చూస్తూ, సీతతో మాట్లాడడానికి తగిన సమయం కోసం నిరీక్షిస్తూ, వృక్షశాఖలలో లీనమై ఉంటాడు. తరువాత, త్రిజటా స్వప్నవృత్తాంతం, శ్రీరామచంద్రుని విజయాన్ని సూచించే వాక్యాలు, రాక్షసకాంతలు భయభ్రాంతలు కావడం మొదలైనవి జరుగుతాయి. సీత

రాక్షస స్త్రీలకు అభయం ఇస్తుంది. రాఘవవిజయసూచకమైన ఆ స్వప్నసమయంలో హనుమంతుడు వృక్ష శాఖలలో ఇతరులకు అదృశ్యుడై ఉంటాడు. అప్పుడు, ఒక పక్షి శుభశకునాన్ని సూచిస్తుంది. ఆ పక్షి ఎవరో కాదు, హనుమంతుడే.

**"పక్షీ చ శాఖానిలయః ప్రవిష్టః**
**పునఃపున శ్చోత్తమసాంత్వవాదీ,**
**సుస్వాగతాం వాచ ముదీరయానః**
**పునః పునః చోదయతీవ హృష్టః"**

అనేది ఆ శ్లోకం. ఇందులో ఆచార్యుడు ప్రత్యక్షం కావడాన్ని ఆచార్యకృత్యాన్ని వాల్మీకి స్పష్టం చేస్తున్నాడు. ఇక్కడ ప్రయోగింపబడిన "పక్షీ "అనే పదం "యథా ఖే పక్షిణాం గతిః, తథైవ జ్ఞాన కర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః" అని చెప్పినట్లుగా భగవంతుని ప్రాప్తికి జ్ఞాన కర్మలతో కూడిన ఆచార్యుడే సమర్థుడని తెలుపుతున్నది. ఈ జ్ఞానకర్మలతో కూడిన ఆచార్యుడు వేదశాఖలో నిష్ఠను కలిగినవాడై, వేదార్థవిషయకమైన శ్రవణమన నిధిధ్యాసనరూప తదనుష్ఠానాలను నిర్వర్తించేవాడని అభిప్రాయం. "ప్రహృష్టః "అనే పదం వల్ల మనన నిదిధ్యాసనాదుల చేత ఆచార్యుడు సంతోషాన్ని పొందుతున్నాడనే అర్థం వస్తున్నది. "ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్యః సర్వదేహిభిః" అనే విధంగా భగవంతుని చింతనలో నిమగ్నుడై ఉండి ఆచార్యుడు ఆనందాన్ని పొందుతున్నాడు— అని చెప్పబడింది. "పునః పునః" అని అన్నందున, వ్యవసాయదారుడు, ఏ విధంగా తాను ఒకసారి చేసిన వ్యవసాయం ఫలించకపోయినప్పటికీ నిరాశను పొందకుండా, వ్యవసాయాన్ని వదిలిపెట్టకుండా, మళ్లీ మళ్లీ సాగును చేస్తాడో, ఆ విధంగానే ఆచార్యుడు కూడా శిష్యునకు తన హితవచనాలతో మాటిమాటికి బోధ చేసి, ఆ శిష్యుని

సరి అయిన జ్ఞానాన్ని కలిగినవాడుగా చేస్తాడని సూచింపబడింది. "పునః పునః చోదయతీవ" అని అన్నందున "స్ఖలిత్యే శాసితారమ్" అనే విధంగా, శిష్యుడు తప్పయిన మార్గంలో ఉన్నట్లయితే, వానిని సరి చేసి శాసించి, దిద్దుబాటు చేయడం ఆచార్యకృత్యం— అని చెప్పబడింది. "సుస్వాగతం వాచ ముదీరయానః" అని అన్నందున, ఆచార్యుడైన హనుమంతుడు సీతాదేవికి శ్రీరామచంద్రుని వృత్తాంతం చెవులకింపుగా వినిపించబోతున్నాడు —అని సూచించబడింది. ఇటువంటి ఈ పక్షిశకునం హనుమంతుడనే ఆచార్యుడు వృక్షశాఖలలో ఉండడాన్ని ఈ శ్లోకంద్వారా సూచిస్తున్నది.

తరువాత, హనుమంతుడు తన ఘటకకృత్యానికి తగినట్లుగా సీతతో సంభాషించి, ఆమెకు నమ్మకాన్ని కలిగించాడు. శ్రీరామనామాంకితం అయిన ముద్రికను ఆమెకు ఇచ్చి, ఆమెనుండి ఆనవాలుగా చూడామణిని తీసుకొన్నాడు. తాను ఇంత దూరం వచ్చిన తరువాత, లంకయొక్క, రావణునియొక్క బలస్వరూపాదులను తెలుసుకోవడం మంచిది కదా! వానిని ఏ విధంగా తెలుసుకోవాలి? అని ఆలోచించి అశోకవనాన్ని పాడు చేస్తాడు. ఆ తరువాత అతడు అక్షయకుమారుడు మొదలైన రాక్షసులను సంహరించి, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి కట్టుబడి, రావణ సభకు వెళతాడు. అక్కడ రావణాసురునితో నిర్భయంగా తాను వచ్చిన కార్యాన్ని గూర్చి చెప్పి, శ్రీరామచంద్రుని పరాక్రమాదులను తెలియజేస్తాడు. "బ్రహ్మా స్వయంభూః చతురాననో వా, రుద్రః త్రినేత్రః త్రిపురాంతకో వా, ఇంద్రో మహేంద్రః సురనాయకో వా, త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్" అని అన్వయవ్యతిరేకాలతో శ్రీరామపరాక్రమ శక్తిని విశదీకరిస్తాడు. చాలా కోపాన్ని పొందిన రావణుడు హనుమంతునకు మరణ దండనను విధించాడు. అయితే, విభీషణుని చేత బోధితుడై రావణుడు హనుమంతునకు తాను విధించిన మరణ దండనను విరమించి, హనుమంతుని వాలాన్ని దగ్ధం చేయమని తన అనుచరులకు ఆజ్ఞాపించాడు. తన

వాలానికి పెట్టిన నిప్పుతోనే హనుమంతుడు లంకను అంతటిని దహించి, సీతాదేవి విషయమై "ఆమె దగ్ధమైనదా?" అనే సందేహాన్ని పొంది, ఆమె సురక్షితంగా ఉండడాన్ని ప్రత్యక్షంగా చూచి, ఓదార్పును పొంది, సముద్రాన్ని దాటి సముద్రతీరంలో ఉండే అంగదుడు మొదలైనవారిని కలసికొంటాడు. కిష్కింధకు వచ్చి, సంతోషాతిశయంతో మధువనంలో యథేష్టంగా విహారానికి వానరులకు అనుమతిని ఇచ్చాడు. తరువాత శ్రీరామచంద్రుని వద్దకు వెళ్లి, "దృష్టా సీతా "అని పలుకుతూ, సీతాదేవి సురక్షితంగా ఉండడాన్ని అతనికి తెలియజేశాడు. తాను పలికే వాక్యాన్ని సీతా అని ఆరంభిస్తే, "దృష్టా" అనే పదం ప్రయోగం చేసే లోపుగానే రామచంద్రునకు మనఃస్థితి ఏమగునో! అని భావించి, ముందుగా "దృష్టా" అని అంటాడు. ఇంతటి విచక్షణతో ఆలోచించి చూచేవాడు హనుమంతుడు అందుచేతనే, శ్రీరామాయణ నాయికానాయకులైన సీతారాములచే యోగ్యతా పత్రాన్ని అతడు సంపాదించగలిగాడు.

"విక్రాంతః త్వం సమర్థః త్వం ప్రాజ్ఞః త్వం వానరోత్తమ!" అని సీతాదేవి, "వైదేహి! సుభగే! హారం యస్య తుష్టాసి భామిని!, పౌరుషం విక్రమో బుద్ధిః యస్మిన్నేతాని నిత్యశః" అని శ్రీరామచంద్రుడు ఐకకంఠ్యంగా హనుమంతుని సామర్థ్యాన్ని పొగిడారు. శ్రీరామచంద్రుడు ప్రీతితో "ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః", అని సర్వస్వదానమనదగిన తన ఆలింగనాన్ని ప్రసాదించాడు.

**"హనుభూష విభీషణయోః స్యాం**
**యతమా విహ మోక్ష ముపేక్ష్య,**
**రఘునాయక నిష్క్రయ భూతం**
**భువి రంగధనం రమయేతే,"**

అని హనుమంతుడు, విభీషణుడు అనే ఈ ఇద్దరే మోక్షాన్ని కాదని, శ్రీ సీతారామచంద్రులచేత ఆరాధించబడిన శ్రీరంగనాథుని నిరంతరం సేవిస్తున్నారు.

**“యత్ర యత్ర రఘునాథకీర్తనం**
**తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,**
**బాష్పవారిపరిపూర్ణ లోచనం**
**మారుతం నమత రాక్షసాంతకమ్”**

★★★★

## ఆళ్వార్ల సూక్తులలో భగవద్గీతామహిమ

భగవద్గీత ఒక అతృప్తామృతం. దాని వైభవాన్ని ఇద్దరు ఆళ్వార్ల సూక్తుల ద్వారా కొంచెం గమనిద్దాం.

పదిమంది ఆళ్వార్లలో, వరుసలో నాలుగవవారు తిరుమழிశై అళ్వార్లు. వారు అనుగ్రహించిన నాన్ముగన్ తిరువందాది అనే ప్రబంధంలో, ఒక పాశురాన్ని అనుగ్రహిస్తూ, అందులో గీతావైభవాన్ని ఈ విధంగా తెలియజేస్తున్నారు.

**"శేయన్ ఆణియన్ శిఱియన్ మిగ ప్పెరియన్,**
**ఆయన్ తువరైక్కోనాయ్ నిన్ఱ మాయన్, – అన్ఱు**
**ఓదియ వాక్కదనైక్కల్లార్, ఉలగిల్**
**ఏదిలరాయ్ మెయ్ ఞానమిల్" (71)**

అనేది వారు అనుగ్రహించిన ఒక అద్భుతమైన పాశురం.

భగవంతుడు మనకు దూరంలో ఉన్నాడు. ఆ విధంగానే, సమీపంలోను ఉన్నాడు. అతడు మనకు సులభుడై, ఉన్నాడు. మనకు అందనివాడై, చాలా గొప్పవాడై ఉన్నాడు. ఆ విధంగా ఉండేవాడు ఎవరు? అంటే, పరమపురుషుడైన ఆ భగవంతుడే రేపల్లెలో గోపాలుడై, అందరికీ సులభుడై, శ్రీకృష్ణుడై అవతరించినందున చాలా గొప్పవాడు. తనను అందరికీ అందుబాటులో ఉండేటట్లుగా అయ్యాడు కదా. అతడు తన గొప్పతనాన్ని అంతటినీ మరుగుపరచుకొని, తన సౌలభ్యాన్ని ప్రదర్శిస్తూ అవతరించాడు. అతడే ద్వారకాధీశుడు. పశ్చిమ సముద్ర తీరంలో ఉండే ద్వారకానగరానికి ప్రభువై మనకు దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాడు. అటువంటి, ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడైన ఆ స్వామి, ఆనాడు కురుక్షేత్రంలో కౌరవ పాండవులకు మధ్య యుద్ధం జరిగినప్పుడు, అర్జునుని రథం తొట్టిలో కూర్చుని ఉండి,

ఉపదేశించిన, 700 శ్లోకాలను 18 అధ్యాయాలను కలిగిన గీతాశాస్త్రాన్ని ఎవరు అధ్యయనం చేయకుండా విడచి పెడతారో, వారు ఈ లోకంలో యథార్థమైన తత్వాన్ని ఈ కొంచెం కూడా తెలియలేరు. అటువంటివారికి సామాన్య జ్ఞానమే కలుగదు అంటే, ఇక విశేషమైన తత్వజ్ఞానం ఏ విధంగా కలుగుతుంది? అని ఈ పాశురంలో ఆళ్వార్లు అంటున్నారు.

అందువల్ల గీతాశాస్త్రాన్ని అధ్యయనం చేస్తే, గ్రహించవలసిన తత్వజ్ఞానం పరిపూర్ణంగా కలుగుతుంది, ఎన్ని విషయాలను తెలుసుకున్నా, భగవద్గీతను గ్రహించకపోతే, ఆ జ్ఞానం పరిపూర్ణంగా ఏర్పడదు, ఎన్ని శాస్త్రాలను అధ్యయనం చేసినా ప్రయోజనం లేదు — అని ఆళ్వారులు ఈ సూక్తిదా  తెలిపినట్లయినది.

ఈ విధంగానే, నమ్మాళ్వార్లు ఇంకొక అద్భుతమైన పాశురంలో గీతావైభవాన్ని ఈ విధంగా అనుగ్రహిస్తున్నారు.

**“అఱివినాల్ కుఱైవు ఇల్లా అగల్ ఞాలత్తవర్ అఱియ,**
**నెఱి ఎల్లామ్ ఎడుత్తురైత్త నిఱై ఞానత్తొరు మూర్ త్తి”**

అని తిరువాయ్ మొழிలోని ఒక పాశురంలో వారం గీతాశాస్త్రవైభవాన్ని ప్రస్తావించారు.

ఈ ప్రపంచంలో ఉండేవారమైన మనం “ఆత్మజ్ఞానాన్ని పొందాలి, జీవితంలో ఉన్నతమైన స్థితిని పొందాలి, మంచి చింతనలతో చక్కని జీవనాన్ని సాగించాలి, సమదర్శనాన్ని అంతటా వ్యాపింప చేయాలి” అని అంటే, మనం మిగతా శాస్త్రాన్ని తప్పక అధ్యయనం చేయాలి— అని వారు అంటున్నారు.

చాలా విశాలమైన ఈ ప్రపంచంలో ఉండేవారంతా గ్రహించే విధంగా, వారు ఉజ్జీవించటానికి ఆవశ్యకమైన మార్గాలను అన్నిటిని శ్రీగీతాశాస్త్రంలో ప్రస్తావించి,

వివరించాడు, శ్రీకృష్ణపరమాత్మ. ఆ స్వామి ఒక అద్వితీయమైన, అందమైన రూపంతో ఈ లోకంలో అవతరించాడు.

ఆలోచించి చూడండి. శ్రీకృష్ణుడు పరమపురుషుడుగానే వైకుంఠంలోనే వేంచేసి ఉండి ఉండవచ్చు ఎవరినైనా ఈ భూలోకానికి పంపించి, వారి ద్వారా ఈ గీతాశాస్త్రాన్ని ఉపదేశింపజేసి ఉండవచ్చు. లేక, వేదాన్ని వ్యక్తం చేసినట్లుగా, గీతను కూడా వ్యక్తం చేసి ఉండవచ్చు. ఆ విధంగా చేయకుండా, తాను ఒక అందమైన, దివ్యమైన రూపాన్ని ధరించి జన్మించి, అర్జునుని రథం తొట్టిలో వేంచేసి ఉండి, ఆ అర్జునుని శిష్యునిగా చేసికొని, తాను ఆచార్యుడై కదా, ఈ గీతాశాస్త్రాన్ని లోకానికి ఉపదేశించాడు. అందువల్ల, తాను నేరుగా గీతను ఉపదేశించడంలో శ్రీకృష్ణునకు ఎంతటి ఆశ ఉన్నదో చూడండి. ఈ విధంగా ఈ గీతా శాస్త్రాన్ని కురుక్షేత్రంలో ఒక అర్జునుని ఉద్దేశించి ఉపదేశించినా, అది, మన అందరిని దృష్టిలో పెట్టుకొని ఉపదేశించినదే. మనం అందరం బాగుపడటం కోసం ఉపదేశించినదే.

ఇది, నమ్మాళ్వార్లు కీర్తించిన గీతాశాస్త్రవైభవప్రకారం.

★★★★

## మధురకవుల, నమ్మాళ్వారుల సూక్తులలో భగవద్గీతావైభవమ్

శ్రియఃపతి అయిన భగవంతుని నిర్హేతుకకృప వల్ల భ్రమప్రమాదాది దోషాలు ఏమీ లేని, భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానాన్ని పొందినవారు— దివ్యసూరులు అనబడే ఆళ్వారులు. అళ్వార్లలో ఒక అళ్వార్లుగా నమ్మాళ్వార్లు అవతరించినప్పటికీ కూడా, ఆ అళ్వార్లలో ముఖ్యులు ఎవరు? అంటే, స్వామి నమ్మాళ్వారులే. ఆళ్వార్లలో అవయవి అంటే వారే. వారు అనుగ్రహించిన దివ్యమైన శాస్త్రాలు నాలుగు. అవి, తిరువిరుత్తం అని, తిరువాశిరియం అని, పెరియ తిరువందాది అని, తిరువాయ్ మొ*ళి* అని చెప్పబడుతున్నాయి. ఈ నాలుగు శాస్త్రాలలో నాలుగవ శాస్త్రం తిరువాయ్ మొ*ళి* దివ్యప్రబంధం.

నమ్మాళ్వార్లను దైవంగా భావించినవారు, మధురకవి ఆళ్వారులు. "తేవు మ*ఱ్ఱ*ఱియేన్" (నా ఆచార్యులైన నమ్మాళ్వార్లను తప్ప వేరొక దైవాన్ని దేనినీ నేను తెలియను) అని అంటున్నారు, మధురకవి ఆళ్వారులు. "దైవం అనే శబ్దానికి అర్థం నా ఆచార్యులైన నమ్మాళ్వార్లు ఒక్కరే "అనేది ఆ సూక్తిలో వారు నిశ్చయించిన పరమార్థం. ఆ మధుర కవి ఆళ్వారులు తమ ఆచార్యులైన నమ్మాళ్వారుల వైభవాన్ని చాలా అద్భుతమైన, కణ్ణినుణ్ శిఱుత్తాంబు అనే, 11 పాశురాలను కలిగిన ఒక చిన్న ప్రబంధంలో అనుగ్రహించారు. అందులో, ఈ పాశురం చాలా ఆశ్చర్యకరమైన పాశురం. ఈ పాశురంలో భగవద్గీతా వైభవం ఏ విధంగా రస్యంగా, నిగూఢంగా ప్రస్తావింపబడిందో గమనిద్దాం.

"అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వుఱు మఱైయిన్ పొరుళ్, అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమి*ళ్* పాడినాన్ అరుళ్ కండీర్ ఇవ్వులగినిల్ మిక్కదే" అనేది ఆ ప్రబంధంలోని ఒక అద్భుతమైన పాశురం. నంజీయర్ అనే పరమచార్యులు, నంబిళ్ళై అనే పరమాచార్యులు, పెరియ వాచ్చాన్ పిళ్ళై అనే ఒక

మహానుభావులు, నాయనార్ అనే ఇంకొక మహనీయులు— వీరు అందరూ ఈ కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాని వ్యాఖ్యానాలను అద్భుతంగా అనుగ్రహించారు. ఈ పాశురానికి ఈ వ్యాఖ్యాతలు అందరూ ఒకే విధంగా అర్ధాన్ని తెలియజేశారు. అయితే, ఒకే ఒక వ్యాఖ్యాత మాత్రం ఇక్కడ ఒక విలక్షణమైన అర్థాన్ని అనుగ్రహించారు. ఈ రెండు విధాలయిన వ్యాఖ్యానాలను ముందుగా గమనిద్దాం.

ఈ పాశురంలో "అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్" (కరుణను కీర్తించే భక్తులు అందరూ ఆనందించే విధంగా ఆ అరుదైన వేదంలోని అర్థాన్ని అనుగ్రహించారు)అని మధురకవి ఆళ్వారులు ఈ పాశురపూర్వార్ధంలో అన్నారు కదా. ఆ విధంగా అరుదైన వేదార్ధాలను అనుగ్రహించినవారు ఎవరు? అనే ఈ ప్రశ్నకు సమాధానంగా "అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్ అరుళ్ కండీర్ ఇవ్వులగినిల్ మిక్కదే" (దయతో వేయి పాశురాలను కలిగిన, మధురమైన ద్రావిడ ప్రబంధాన్ని పాడినవారి దయను గమనించండి. అది ఈ లోకంలో చాలా గొప్పది) అని పాశురం ఉత్తరార్థంలో మధురకవి అళ్వార్లు అన్నారు కదా. ఆ విధంగా మధురమైన ద్రావిడ ప్రబంధాన్ని అనుగ్రహించినవారు ఎవరు? ఈ విధంగా, ఈ పాశురంలోని పూర్వార్ధంలో —అరుదైన వేదార్థాలను అనుగ్రహించినవారుగా చెప్పబడే వ్యక్తి విశేషం ఎవరు? ఉత్తరార్ధంలో — దయతో వేయి పాశురాలను కలిగిన మధురమైన ప్రబంధాన్ని పాడినవారు—అని చెప్పబడే ఆ వ్యక్తి విశేషం ఎవరు? అని ఇక్కడ సందేహం కలుగుతుంది కదా. ఈ ప్రశ్నలకు సమాధానంగా పలువురు మహాచార్యులు ఏ విధంగా వ్యాఖ్యానం చేశారు? అంటే, ఈ పాశురం పూర్తిగా నమ్మాళ్వారును గురించి ఉద్దేశించినది— అని వ్యాఖ్యానం చేశారు.

మధురకవుల, నమ్మాళ్వారుల సూక్తులలో భగవద్గీతావైభవమ్

“అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్” అని పాశురం పూర్వార్ధంలో —అరుదైన వేదార్థాలను అనుగ్రహించినవారుగా చెప్పబడినవారు నమ్మాళ్వారులే —అని, “అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్” అని ఉత్తరార్ధంలో కరుణతో వేయి తీయని పాశురాలను పాడినవారుగా చెప్పబడినవారు కూడా నమ్మాళ్వారులే —అని ఈ పాశురాన్ని పూర్తిగా నమ్మాళ్వారుల పరంగా పలువురు పూర్వాచార్యులు వ్యాఖ్యానం చేశారు.

అయితే ఒకే ఒక మహా చార్యులు తమ వ్యాఖ్యానంలో ఈ పాశురానికి ఒక విలక్షణమైన అర్థాన్ని తెలియజేశారు. పాశురంలోని పూర్వార్ధంలో అరుదైన వేదార్థాలను అనుగ్రహించినవాడుగా నిర్దేశంపబడినవాడు— గీతాచార్యుడైన శ్రీ పార్థసారథి స్వామి— అని, ఉత్తరార్ధంలో, మధురమైన ద్రావిడ ప్రబంధాన్ని అనుగ్రహించినవారుగా నిర్దేశింపబడినవారు— తమ ఆచార్యులైన నమ్మాళ్వార్లు అని శ్రీమధురకవి ఆళ్వారులు ఈ పాశురంలో తెలుపుతున్నట్లుగా ఆ వ్యాఖ్యాత వివరించారు. “అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్” అని నిర్దేశింపబడినవాడు గీతాచార్యుడు—అని. “అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్” ఆ గీతాచార్యుని అనుగ్రహంతో వేయి తీయని ద్రావిడ పాశురాలను పాడినవారు నమ్మాళ్వార్లు —అని ఈ పాశురం పూర్వార్ధంలో శ్రీకృష్ణుని, ఉత్తరార్ధంలో నమ్మాళ్వార్లను మధురకవి ఆళ్వార్లు నిర్దేశిస్తున్నట్లుగా ఆ మహాచార్యుల వ్యాఖ్యానం. దానిని అనుసరించి, నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పాడారు అంటే, దానికి కారణం తిరువల్లి క్కేణి దివ్యక్షేత్రంలో అధివసించి ఉండే పార్థసారథి స్వామియే— అని మనం సులభంగా, చక్కగా గ్రహించవచ్చు. ఈ పాశురంలో, తిరువల్లి క్కేణి అనే శబ్దం లేకపోయినప్పటికీ కూడా, మన ఆచార్యులు శ్రీపార్థసారథి అని అన్నందున, గీతాచార్యుడు అని అన్నందున, అతడు తిరువల్లి క్కేణి దివ్యదేశంలో, సముద్రతీరంలో మనోహరంగా మనకు దర్శనాన్ని అనుగ్రహిస్తున్న ఆ

శ్రీకృష్ణ భగవానుడు తప్ప వేరొకరు అయ్యే అవకాశం లేదు. "అరుళినాన్ అవ్వఋ మఱైయిన్ పొరుళ్"— ఆ వేదాంతర్థాలను అన్నిటిని గీతాశాస్త్ర రూపంలో అనుగ్రహించాడు, పరమాచార్యుడైన శ్రీకృష్ణ భగవానుడు.

భగవంతుడు ఇటువంటి, ఉన్నతమైన గీతాశాస్త్రాన్ని అనుగ్రహించాడు కదా! అది ఎవరి కోసం? నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ఝి* ప్రబంధంలో ఈ విషయాన్ని గూర్చి ఒక అద్భుతమైన పాశురాన్ని పాడారు. ఆ పాశురం ఏమంటే,

**"అఱివినాల్ కుఱైవిల్లా ఆగల్ ఞాలత్తవర్ అఱియ**
**నెఱి ఎల్లామ్ ఎడుత్తురైత్త నిఱై ఞానత్తు ఒరు మూర్ త్తి"**
అనేది ఆ పాశురం.

భగవచ్ఛబ్దం చేత చెప్పబడేవాడు, సర్వజ్ఞశిఖామణి అయిన స్వామి గీతాచార్యుడు ఎవరికోసం ఈ గీతాశాస్త్రాన్ని చెప్పాడు? అని అంటే, దానికి సమాధానంగా నమ్మాళ్వారులు "అఱివినాల్ కుఱైవిల్లా ఆగల్ ఞానత్తవర్ అఱియ నెఱి ఎల్లామ్ ఎడుత్తురైత్త నిఱై ఞానత్తు ఒరు మూర్ త్తి" అని అన్నారు. ఈ సూక్తిలోని భావం ఏమి?

"నెఱి ఎల్లామ్" అంటే— మార్గాలను అన్నిటిని మోక్షమార్గాలను అన్నిటిని — అని అర్థం. కర్మయోగం అనే ఉపాయం, జ్ఞానయోగం అనే ఉపాయం, భక్తియోగం అనే ఉపాయం— అని అనేక విధాలుగా ఉండే ఉపాయాలు అంగాంగి భావంతో వేదాంతంలో ఎక్కడ ఎక్కడ చెప్పబడ్డాయో, ఎక్కడ ఎక్కడ గుప్తంగా ఉన్నాయో, వాటిని అన్నిటిని భగవంతుడు, భూమి లోపల గుప్తంగా ఉండే ధనాన్ని వెలికి తీసి ఇచ్చినట్లుగా, వెలికి తీసి గీతాశాస్త్రరూపంలో మనకు అనుగ్రహించాడు.

అర్జునుడు ప్రశ్నించాడు, దానికి సమాధానంగా కేశవుడు బదులు చెప్పాడు. అదే గీతాశాస్త్రం. కేశవార్జున సంవాదమే గీతాశాస్త్రం. ఆ అర్జునుడు గుడాకేశుడు,

సమాధానం చెప్పిన కేశవుడు హృషీకేశుడు. అర్జునునకు సంప్రదాయంలో గుడాకేశుడు అని పేరు. శ్రీకృష్ణుడైన భగవంతునకు సంప్రదాయంలో హృషీకేశుడు అని పేరు. గుడాకేశుడు ఆలకించగా, హృషీకేశుడు చెబుతున్నాడు. ఆ విధంగా అర్జునునకు భగవంతుడు ఉపదేశించిన శాస్త్రమే గీతాశాస్త్రం— అని మనమంతా భావిస్తున్నాం.

అయితే, ఆ ఆళ్వారులు ఇంకొక విధంగా పలుకుతున్నారు. కేవలం అర్జునునకు మాత్రమే భగవంతుడు గీతాశాస్త్రాన్ని ఉపదేశించలేదు, లోకానికి అంతటికి కూడా ఉపదేశించాడు— అని వారు అంటున్నారు.

బంధువులు అందరూ యుద్ధరంగంలో ఉన్నారు. వారి విషయంలో అర్జునునకు అపారమైన స్నేహం. "వారిని అందరిని వధించవలసి వస్తున్నదే!" అనే భీతి అతనికి కలిగింది. ఈ విషయాన్ని చాలా అందంగా శ్రీయామునులు గీతార్ధ సంగ్రహంలో ఈ క్రింది విధంగా నిరూపిస్తున్నారు.

**"అస్థానస్నేహకారుణ్యధర్మాధర్మ ధియాకులమ్,**
**పార్థం ప్రపన్నముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్"**

అని అంటున్నారు, శ్రీయామునులు. అర్జునునకు అస్థానంలో స్నేహమట, అస్థానంలో కారుణ్యమట. తన వర్ణాశ్రమధర్మమైన యుద్ధంలో అధర్మం అనే భావనవల్ల భ్రాంతి అట. ఇటువంటి. మూడు దోషాలను కలిగినవాడు, అర్జునుడు. అటువంటి అర్జునుని, "ఉద్దిశ్య"— ఉద్దేశించి ధీతా శాస్త్రాన్ని శ్రీకృష్ణభగవానుడు అనుగ్రహించాడు— అని అంటున్నారు, యామునులు. శరణాగతి చేసినవాడు పార్థుడు, ప్రపన్నుడైన అర్జునుడు. అతనిని ఉద్దేశించి గీతాశాస్త్రాన్ని ఉపదేశించినట్లుగా యామునులు అంటున్నారు. అయితే, ఈ శ్లోకంలో ఉండే "ఉద్దిశ్య" అనే పదాన్ని శ్రీదేశికులు తాత్పర్యచంద్రికలో వ్యాఖ్యానిస్తూ, ""వ్యాజీకృత్య" అని అన్నారు. అంటే, ఆ అర్జునుని నెపంగా చేసుకొని —అని అర్థం. అర్జునుని మాత్రం ఉద్దేశించి భగవంతుడు

గీతాశాస్త్రాన్ని ఉపదేశించలేదు. అర్జునుని నెపంగా చేసుకొని, లోకానికి అంతటికి భగవానుడు గీతను ఉపదేశించాడు— అనేది మన పూర్వాచార్యుల అభిప్రాయం.

పైన ఉదాహరించిన నమ్మాళ్వారుల పాశురమే ఈ విధంగా మన పూర్వాచార్యులు అభిప్రాయపడడానికి, వ్యాఖ్యానించడానికి మూలం అయినది. గీతాశాస్త్రాన్ని భగవంతుడు ఎవరికోసం చెప్పినట్లుగా ఆళ్వార్లు అంటున్నారు? అంటే, "ఆగల్ ఞాలత్తవర్ అఱియ"— విశాలమైన ఈ లోకంలో ఉండేవారు అందరూ తెలుసుకోవడం కోసం ఈ గీతాశాస్త్రాన్ని భగవంతుడు అనుగ్రహించాడు— అని వారు అంటున్నారు.

ఈ పాశురంలో, ఈ లోకంలో ఉండే మనలను ఉద్దేశించి ఆళ్వార్లు ఏమని నిర్దేశిస్తున్నారో, గమనించాలి. "అఱివినాల్ కుఱైవిల్లా ఆగల్ ఞాలత్తవర్"— జ్ఞానంలో ఏ విధమైన కొరత లేకుండా, విశాలమైన ఈ భూమండలంలో ఉండేవారం మనం— అని మనలను ఉద్దేశించి ఆళ్వార్లు పలుకుతున్నారు. మనకు జ్ఞానంలో ఏ విధమైన కొరత లేదట.

వెంటనే మనకు ఒక సందేహం కలుగుతుంది. మనకు జ్ఞానంలో ఏ విధమైన లోటు లేకపోతే, మరి, ఆ భగవానుడు గీతా శాస్త్రాన్ని ఎందుకు ఉపదేశించినట్లు? మనమందరం కూడా పరిపూర్ణమైన ప్రజ్ఞను కలిగినవారమా? జ్ఞానంలో మనకు ఏ విధమైన లోటు లేదా? ఈ విధంగా ఆళ్వార్లు పలకడంలో ఏమి తాత్పర్యం? అని మనకు పై పైన గమనించి చూసినప్పుడు ఏమీ అర్థం కాదు.

పరమాచార్యులైన నంబిళ్ళై ఈ ఆళ్వార్ల సూక్తిని ఈ విధంగా వివరిస్తున్నారు. తమ ఈడు వ్యాఖ్యానంలో అద్భుతంగా ఈ అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఈ లోకంలో ఉండే మనవంటివారికి అందరికీ అనేకమైన కొరతలు ఉన్నాయి. మనకు

ఉండే కొలతలు ఎటువంటివై ఉన్నాయి? శరీరంలో బలం లేదే! అనేది ఒక కొరత. పత్ని లేదే! అనేది ఒక కొరత. సంతానం లేదే! అనేది ఒక కొరత. ధనం లేదే !అనేది ఒక కొరత. ఇల్లు లేదే! అనేది ఒక కొరత. పొలం లేదే !అనేది ఒక కొరత. అందువల్ల మనకు బలం లేకపోయినా, పత్ని లేకపోయినా, సంతానం లేకపోయినా, ధనం లేకపోయినా, ఇల్లు లేకపోయినా, పొలం లేకపోయినా, మన మనసులో కొరత తోస్తుంది.

ఇక్కడ ఆళ్వార్లు ప్రస్తావించేది ఈ కొరతలు ఏమీ కాదు. "అఱివు ఇల్లై"— మనకు జ్ఞానం లేదు, సరే, "నాకు శాస్త్రజ్ఞనం లేదే!" అని కొరత మనకు ఎవరికైనా మనసులో కలుగుతున్నదా ?అని అంటే, ఆ విధమైన కొరత కూడా ఏమీ మనకు ఏనాడూ మనస్సులో కలగడం లేదు— అని అంటున్నారు, ఆళ్వారులు. ఆ విషయాన్ని "అఱివినాల్ కుఱైవిల్లా ఆగల్ ఞాలత్తవర్" అని అంటూ తెలియజేస్తున్నారు. జ్ఞానం లేకపోవడం విశేషం కాదు ఆ జ్ఞానం మనకు లేదే! అనే కొరత కూడా మన మనసులో కలగకపోవడమే విశేషం— అని అంటున్నారు, ఆళ్వారులు. శాస్త్రార్థజ్ఞానం లేకపోవడం అనేది సరే, ఆ జ్ఞానం లేదే! అని కొరతయినా మనసులో కలుగవద్దా! ఆ విధంగా తోస్తే కదా, ఒక మహానుభావుడైన ఆచార్యుని ఆశ్రయించి, వారి అనుగ్రహఫలంగా శాస్త్రంలోని పరమార్థాలను మనం తెలుసుకోవడానికి సాధ్యం అవుతుంది.

శ్రీ పిళ్లైలోకాచార్యులవారు ఒక అద్భుతమైన సూత్రంలో ఈ విషయాన్ని ప్రస్తావిస్తున్నారు. "సంసారికళ్ తంగళైయుమ్, ఈశ్వరనైయుమ్ మఱందు" (సంసారులు తమను, భగవంతుని కూడా మరచిపోయి) అనేది మనకుండే ఒక విలక్షణమైన మహాలక్షణం. అంతేనా, అంతమాత్రం కాదంటున్నారు. "ఈశ్వర కైంకర్యత్తైయుమ్ ఇழన్దు" (భగవంతునకు సేవ చేయడం అనేది కూడా కోల్పోయి). ఇది రెండవ లక్షణం. తమను, భగవంతుని మరచిపోవడం అనేది ఒక పెద్ద విషయం కాదు. అంతకుమించి, భగవంతునకు సేవ చేయడాన్ని కూడా మనం కోల్పోతున్నాము.

ఇది కూడా గొప్ప విషయం కాదు. దీనికి మించి కూడా ఇంకొక లక్షణం మనకు ఉన్నది. అది ఏమంటే, “ఇழన్దోమ్ ఎన్గిఱ ఇழవు మిన్ఱిక్కే” (దానిని కోల్పోయామే– అనే విచారం కూడా లేకుండా) ఉండడమే. భగవత్కైంకర్యాన్ని కోల్పోతే కోల్పోవచ్చు. దానిని కోల్పోయామే! అనే విచారం అయిన ఉండవద్దా! అదికూడా లేదని అంటున్నారు.

దీనినే ఆళ్వార్లు పైన పాశురంలో తెలియజేశారు. ఏది లేకపోయినా లేకపోవచ్చు. కానీ, శాస్త్రజ్ఞానం లేదే!, వేదాంతర్థజ్ఞానం లేదే!– అనే కొరత కూడా మనసులో లేకుండా ఉన్నారు కదా. దీనినే “అఱివినాల్ కుఱైవిల్లా ఆగల్ ఞాలత్తవర్” అని తెలియజేస్తున్నారు. ఈ విధంగా ఉండే కొరతను కలిగిన మనకోసం భగవానుడు అర్జునుని నెపంగా చేసుకుని గీతామహాశాస్త్రాన్ని ఉపదేశించాడు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, చతుర్థకులంవారు– అనే మన అందరికోసం ఎంతటి గొప్ప శాస్త్రాన్ని ఆ స్వామి అనుగ్రహించాడోకదా! –అని అంటున్నారు, ఆళ్వారులు.

“అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వఱు మఱైయిన్ పొరుళ్”– ఆ భగవంతుడు. ఆ పార్థసారథి అయిన గీతాచార్యస్వామి అనుగ్రహాన్ని ఆధారంగా చేసుకుని ఆళ్వారులు తీయని పాటలను కలిగిన తిరువాయ్ మొழి ప్రబంధాన్ని పాడారు అని “అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్ అరుళ్” అని అంటున్నారు, మధురకవులు. నమ్మాళ్వారులు 1102 పాశురాలను కలిగిన తిరువాయ్ మొழి ప్రబంధాన్ని పాడారు అంటే, అది ఎవరికి అనుగ్రహాన్ని ఆధారంగా చేసుకుని పాడారు? గీతాచార్యుడైన పార్థసారథి స్వామి అనుగ్రహాన్ని ఆధారంగా చేసుకుని పాడారు– అని మధురకవులు అంటున్నారు.



# మన శరీరంలోనే ఒక కురుక్షేత్రయుద్ధం

ఆనాడు, కురుక్షేత్రంలో, యుద్ధభూమిలో కౌరవ పాండవ సేనలు ఇరువైపులా తలపడి, 18 దినాలపాటు గొప్ప యుద్ధాన్ని చేశాయి. ఆ యుద్ధంలో దైవీసంపదను కలిగిన, సాత్వికగుణాన్ని కలిగిన పాండవ సేన —ఆసుర స్వభావాన్ని కలిగిన, రాజస తామస గుణాలను కలిగిన కౌరవపక్షాన్ని ఓడించి విజయం సాధించినది. ఈ విషయం మహాభారతప్రసిద్ధం.

"ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమిత్యభిధీయతే" (అర్జునా! ఈ శరీరం క్షేత్రమని చెప్పబడుతున్నది) అని భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు "శరీరం క్షేత్రంవంటిది"— అని అన్నాడు. కురుక్షేత్రంలో రెండు వేరు వేరు స్వభావాలను కలిగిన సేనలు పోరాడినట్లే, క్షేత్రంతో సమానమైన మన శరీరంలో కూడా రెండు, వేరు వేరు స్వభావాలను కలిగిన సేనలు తలపడి ఎల్లప్పుడూ పోరాడుతూ ఉంటాయి. అందులో ఒక పక్షం, చాలా ఉన్నతమైన మంచి స్వభావాన్ని కలిగిన శక్తి. ఇంకొకటి, మనం ఎల్లప్పుడూ నశింప చేసుకోవాలని ప్రయత్నం చేసే చెడ్డ శక్తి. ఈ రెండు విధాలయిన శక్తులు ప్రతి జీవిని శరీరంలోను ఎల్లప్పుడూ ఉంటూ పోరాడుతూ ఉంటాయి. ఆ విధంగా మనలోనే రెండు విధాలైన శక్తులు ఉన్నాయా? నిత్యం అని పోరాడుతూ ఉంటాయా? ఒక దానిని ఇంకొకటి గెలవాలని ప్రయత్నం చేస్తూ ఉంటాయా? అని అంటే, "అవును" అనేదే సమాధానం.

మనం అందరం మూడు గుణాలను కలిగినవారం. సత్వం రజస్సు, తమస్సు అనే మూడు గుణాలకు వశమై ఉండేవారం. "తత్ర సత్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్" గీతలో చెప్పిన విధంగా సత్వగుణం అనేది మనసులో ప్రకాశాన్ని కలిగిస్తుంది నిర్మలత్వాన్ని ఏర్పరుస్తుంది. సరి అయిన జ్ఞానాన్ని ప్రకాశింప చేస్తుంది. ఇది సత్వగుణ ప్రభావం వల్ల కలిగే ఫలం. రజోగుణం వల్ల కోపం కలుగుతుంది,

తాపం కలుగుతుంది. కలహించేటట్లు ఆ గుణం చేస్తుంది. అంతు లేని ఆశను కలిగిస్తుంది. ఇది అంతా రజోగుణ ప్రభావం వల్ల కలుగుతుంది. ఇక, మూడవది అయిన తమోగుణం వల్ల అజ్ఞానం, మైకం, సోమరితనం మొదలైనవి అన్ని చెడ్డ గుణాలు కలుగుతాయి. ఈ మూడు గుణాలు మనలోనే ఎల్లప్పుడూ ఉంటాయి.

వీటిలో, సత్వగుణాన్ని కురుక్షేత్రంలోని పాండవసేనతో సమానంగా భావించాలి. రజోగుణతమోగుణాలను దుర్యోధనుని సేనతో సమానంగా భావించాలి. ఒకే కురుక్షేత్రంలో, పాండవ కౌరవ సేనలు అనే రెండు విభిన్న స్వభావాలను కలిగిన పక్షాలు ఏ విధంగా పోరాడాయో, ఆ విధంగానే, మన శరీరంలో కూడా సత్వగుణం అనే సేన, రజోగుణతమో గుణాలు అనే ఇంకొక సేన పరస్పరం పోరాడుతూ ఉంటాయి. శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహంచేత పాండవ పక్షం యుద్ధాన్ని జయించినట్లే, మన శరీరంలో కూడా రజోగుణతమోగుణాలు అనే సేనను సత్వగుణం అనే సేన జయించేటట్టు చేయాలి. ఇందుకోసం శ్రీకృష్ణ భగవానుని అనుగ్రహం కావాలి. ఇందుకోసమే ఆ స్వామి మనకు గీతాశాస్త్రాన్ని అనుగ్రహించాడు.

ఇంతే కాకుండా, మన శరీరంలో మరి రెండు విభిన్న పక్షాలు ఎల్లప్పుడూ కలహిస్తూ ఉంటాయి. ఒక వైపు చూస్తే, మన అహంకారం, మమకారం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే చెడ్డ గుణాలు మనలో ఉంటాయి. ఇంకొక వైపు, జ్ఞానం, శ్రద్ధ, పర ప్రయోజనం కోసం పాటుపడే స్వభావం, దయ, పరోపకార స్వభావంవంటి మంచి గుణాలు ఉంటాయి. ప్రతి వ్యక్తి ఈ రెండు విధాలైన పక్షాలకు లోబడి ఉండేవాడే. మానవుడు ఎప్పుడు వృద్ధిలోకి రాగలడు? ఉన్నతమైన స్థితికి చేరగలడు? అంటే, ఈ రెండు పక్షాలలో, మంచి పక్షం చెడ్డ పక్షాన్ని జయించగలిగినప్పుడే, అది సాధ్యం అవుతుంది. చెడ్డ గుణాలను అన్నిటిని జయించి,

తనలో ఉండే మంచి గుణాలను ఎపుడు ఒకడు అభివృద్ధి చేసుకొంటాడో, అప్పుడే ఆ మానవుడు మంచి వ్యక్తిగా, ఉన్నతమైన వ్యక్తిగా ప్రశంసింపబడతాడు.

అందుచేత కురుక్షేత్రాన్ని చూడడంకోసం మనం ఎక్కడా అన్వేషించవలసిన అవసరము లేదు. ఎక్కడికీ పోవలసిన అక్కరలేదు. మనలోనే ఆ కురుక్షేత్రం ఉన్నది. మన శరీరంలోనే ఉన్నది. ఆ కురుక్షేత్ర యుద్ధాన్ని మనం సరిగా నిర్వహించడానికి ప్రయత్నించేయాలి. ఆయుధాన్ని జయించడానికి ప్రయత్నించాలి. ఎప్పుడు మన ఈ భూమిపై జన్మించామో, ఆ క్షణంనుండే మనలో ఈ విధంగా ఉండే మంచి చెడ్డల రూపంలోని రెండు పక్షాల పోరాటం ప్రారంభమవుతుంది. ఆ పోరాటాన్ని మనం ఎదుర్కోక తప్పదు. దానిని ఎదుర్కోకుండా తప్పుకొని పారిపోదామని అనుకోకూడదు. అది సాధ్యం కాని పని కూడా. ఈ విధంగా మనలో జరిగే మంచి చెడ్డల పోరాటాన్ని మనం ఎదుర్కొని, చెడును అణచి, మనలో ఉండే మంచి జయించేటట్లు చేసికోగలిగితే, మనం ఎవరమో నిరూపించుకోగలిగితే, ఉన్నతమైన గుణాలను వృద్ధి చేసికోగలిగితే, అదే మన ధైర్యం, అదే మన విజయం. అదే మనకు పురోగతి. దానికి మనకు సహాయం చేయడానికి ఎల్లప్పుడూ శ్రీకృష్ణ పరమాత్మ ఉండనే ఉన్నాడు. దానికి మార్గదర్శనం చేయడం కోసం గీతాశాస్త్రం ఉండనే ఉన్నది. అటువంటి ఆ మహనీయమైన గీతాశాస్త్రాన్ని విజ్ఞులైన పెద్దల సన్నిధిలో అధ్యయనం చేయడానికి ప్రయత్నం చేద్దాం. రండి. స్వస్తి.

★★★★

## ఉపనిషత్సూక్తులు – దివ్యప్రబంధశ్రీసూక్తులు

వేదంలోని ఒక్కొక్క శాఖను సంహిత, బ్రాహ్మణం, అరణ్యకం, ఉపనిషత్తు అని నాలుగు భాగాలుగా విభాగం చేస్తారు. సంహిత కాకుండా, మిగిలిన మూడు భాగాలకు బ్రాహ్మణమనే పేరు కూడా ఉన్నదని అంటారు. ఉపనిషద్భాగం అరణ్యకంలో చేరినదే. అరణ్యకంలోని చివరి భాగమే ఉపనిషత్తులు. ఈ ఉపనిషత్తులకు వేదాంతమనే పేరు. కూడా ప్రసిద్ధమైనది. ఇవి పరబ్రహ్మసామీప్యంలో ఉన్నందువలన అంటే, పరబ్రహ్మను స్వరూపరూప గుణ విభూతులతో పాటుగా తెలియజేస్తున్నందున ఉపనిషత్తులు అని చెప్పబడుతున్నాయి అనేది బప్రాచీన సంప్రదాయం వివరణం. ఈ విషయం శ్రీ భాష్యమంగళ శ్లోక వ్యాఖ్యానంలో శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారు తెలియజేశారు.

వేదం అంతా పరమాత్మ వైభవాన్ని తెలియజేసేదే అయినప్పటికీ, విశేషించి ఈ ఉపనిషద్భాగం సాక్షాత్తుగా, ఆ వైభవాన్ని దానిని వివరిస్తున్నందున ఇదే పరమాత్మకు మిక్కిలి సమీపంలో ఉన్నది అవుతున్నది. వేదంలోని పూర్వభాగం ఇంచుమించుగా పరమాత్మ యొక్క విభూతిని మాత్రం తెలియజేస్తుంది. ఆచార్య సన్నిధానంలో కూర్చుని, ఇది శ్రవణం చేయబడుతున్నందున దీనికి ఉపనిషత్ అనే పేరు వచ్చిందని కూడా లోకంలో ప్రసిద్ధి ఉన్నది. తాపాలను నశింప చేసేది, అంటే, జ్ఞానాన్ని కలిగించడం ద్వారా ఆత్మకు కలిగిన తాపాన్ని నశింప చేసేది కనుక ఉపనిషత్ అనబడుతున్నది –అని అద్వైతులు అంటారు. ఈ వివరణ “షద్ల్ –విశరణే” అనే ధాతువును బట్టి చేయబడింది. ఉపనిషత్ భాగం వేదంలోని చివరి భాగం అయినందున, అంటే వేద నిర్ణయాన్ని తెలియజేసే భాగం అయినందున, తప్పక తెలియదగినది. “దీనికి మించినది ఏదీ లేదు” అనే విధంగా ఇక్కడ తాత్పర్య నిర్ణయం

చేయబడినందున, దీని సహాయంతోనే వేదం అంతటికీ చివరిగా అర్థాన్ని తెలియవలసి ఉన్నందున, ఇదే వేదాంతమనే పేరును పొందింది.

వేదాన్ని కర్మకాండం, జ్ఞాన కాండం —అని రెండుగా విభాగం చేస్తారు. కర్మలచే పొందబడే పురుషార్థం ఈ ప్రకృతి మండలంలో ఉండే సంసార రూపమైన ఫలమే. జ్ఞానం ద్వారా పొందబడేది పరమపురుషార్థం. కరణ కళేబరాలనుశ(అంటే, ఇంద్రియాలను దేహాన్ని)ఉపయోగించే అనుభవించవలసిన ప్రయోజనాన్ని వాటి కార్యాలైన కర్మల ద్వారానే పొందడానికి వీలు ఉన్నది. ఆ ప్రయోజనం, దానికి సంబంధించిన సాధనం తెలియదగినవి అవుతున్నాయి. పరమపురుషార్థమనే మోక్షం శాశ్వతమైనది. దానికి సాధనమైన జ్ఞానం కూడా అటువంటిదే. అంటే, శాశ్వతమైనది. చేతనులనబడే ఒక్కొక్క ఆత్మకు చైతన్యమనే జ్ఞానం సహజంగానే ఉండే విషయం. ఇది, దీని ఫలమైన మోక్షంవలెనే, ఆత్మకు సంబంధించినది. కర్మవలె శరీరానికి చెందినది కాదు. పరమాత్మ విషయంలో ఏర్పడే ఉపాసనా జ్ఞానం ఇంకా ఇంకా వృద్ధి చెందుతూనే ఉంటుంది అంటే తప్ప వృద్ధి చెందిన అవధికి నశించదు. అందుచేత జ్ఞానం అనేది ధ్రువమైన, నాశం లేని ఉపాయం. అందుచేత, ప్రయోజనం కూడా ధ్రువమే, ఉపాయం ధ్రువమే. దీనిని ఉపదేశించే కాండం జ్ఞానకాండం. అదే ఉపనిషత్.

ఉపనిషత్తులు నూటికి మించి ఉన్నప్పటికీ, మన దక్షిణ భారతంలో ప్రసిద్ధమైన, ద్వైత అద్వైత విశిష్టాద్వైత మతాలనే మూడు సిద్ధాంతాలలో, ఉత్తర భారతంలో ప్రచారంలో ఉండే వాటితో పాటు మిగిలిన కొన్ని మతాలలోనూ, వివాదం లేకుండా బ్రహ్మసూత్రాన్ని ఆధారంగా చేసికొని ఆదరింపబడుతూ వచ్చే ఉపనిషత్తులనే మనం ఆదరిస్తున్నాము. అవి ఏవి? అంటే— ఈశావాస్య, కేన కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకాలు అనబడే దశోపనిషత్తులు, వీటితో పాటు కౌషీతకి, అగ్ని రహస్య, సుబాలోపనిషత్, అధర్వశిఖ, మహానారాయణోపనిషత్ మొదలైన ఉపనిషత్తులే. వీటిలో, వేదశాఖలలో నాలుగవ

భాగంగా చెప్పబడే ఉపనిషత్ భాగంలో చేరనివి కొన్ని కూడా ఉపనిషత్తులు అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి.

ఆళ్వార్లు అనబడే భక్తాగ్రేసరులు శ్రీమన్నారాయణుని దివ్యమైన, నిర్హేతుకమైన కటాక్షాన్ని పొంది, దాని మూలంగా నిర్దుష్టమైన పరావర తత్వజ్ఞానాన్ని పొందారు. వారు అనుగ్రహించిన ద్రావిడ ప్రబంధాలకు దివ్య ప్రబంధాలు అని, ద్రావిడ వేదం అని శ్రీవైష్ణవ సంప్రదాయంలో పేరు. వీటిలో, దివ్యమైన భగవంతుని అనుభవం వ్యక్తీకరింపబడుతున్నందున దివ్య ప్రబంధాలు అని, ఈ ప్రబంధాలలోని ఎన్నో సూక్తులలో వేదాలలోని అర్థాలు ప్రతిబింబిస్తునందున ద్రావిడ వేదం అని పేరు వచ్చిందని అభిజ్ఞులైన పెద్దల వివరణం.

ఆళ్వారులు 12 మందిలో ప్రధానులు నమ్మాళ్వార్లు. అందుచేత వీరికి అంగి అనే పేరు. ఆ విధంగానే, వీరు అనుగ్రహించిన దివ్యప్రబంధాలకు అంగి ప్రబంధాలు అని పేరు. వేదాలు— ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం —అని నాలుగు విధాలు. ఈ నాలుగు విధాలైన వేదాలతో సమానంగా నమ్మాళ్వారుల నాలుగు ప్రబంధాలు పరిగణింపబడుతున్నాయి. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువిరుత్తం అనే ప్రబంధం ఋగ్వేద సమం అని, తిరువాశిరియం అనే ప్రబంధం యజుర్వేద సమానం అని పెరియ తిరువందాది అనే ప్రబంధం అధర్వణ వేదసమానం అని, ఇక, చివరిది అయిన తిరువాయ్ మొ*ౙి* ప్రబంధం సామవేద సమం అని చెప్పబడుతున్నాయి. మధుర కవులు కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలో నమ్మాళ్వార్లను “వేదమ్ తమి*ౙ్* శెయ్ ద మాఱన్ “(వేదాలను ద్రావిడీకరించిన నమ్మాళ్వార్లు) అని కీర్తించారు. తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన తిరుక్కుఱుందాండగమ్, తిరు నెడుందాండగమ్, పెరియతిరుమొ*ౙి*, తిరువె*ౙు*కూ*ఱ్ఱి*రుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే ఆరు

దివ్యప్రబంధాలు అంగప్రబంధాలు అని చెప్పబడుతున్నాయి. ఈ విషయం శ్రీవరవరమునులు అనుగ్రహించిన ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలోని "మాఱన్ పణిత్త తమిழ் మఱైక్కు మంగైయర్ కోన్ ఆఱంగమ్ కూర అవతరిత్త" (నమ్మాళ్వారులు అనుగ్రహించిన ద్రావిడ వేదరూపాలైన నాలుగు ప్రబంధాలకు అంగాలు అనదగినట్లుగా తిరుమంగై ఆళ్వార్లు పలికిన ఆరు ప్రబంధాలు) అనే సూక్తి వల్ల స్పష్టం అవుతున్నది. ఆ విధంగానే, మిగిలిన ఆళ్వారులు అనుగ్రహించిన 14 ప్రబంధాలు ఉపాంగాలు అని కూడా వ్యవహరింపబడుతున్నాయి. ఈ విధంగా, ద్రావిడ వేదంగా చెప్పబడే ఆళ్వారుల ప్రబంధాలు 24 ఇంచుమించుగా నాలుగువేల పాశురాలను కలిగి ఉన్నందున, ఈ సాహిత్యానికి నాలాయిర దివ్య ప్రబంధం అనే పేరు కూడా వచ్చింది.

అళ్వార్లకు తరువాత జన్మించిన నాథమునులు, యామునమునులు, భగవద్రామానుజులు, వేదాంతదేశికులు, శ్రీవరవరమునులు మొదలైన పూర్వాచార్యులు అందరూ, తాము అనుగ్రహించిన వ్యాఖ్యానాలలోను, స్వతంత్రగ్రంథాలలోను పలు సందర్భాలలో ఉపనిషత్సూక్తులకు, ద్రావిడవేదమైన ఆళ్వారుల దివ్యప్రబంధాలలోని పాశురాలలో గల ప్రయోగాలకు మధ్య ఉండే అర్థసామ్యాలను ఉట్టంకిస్తూ, వాటిని వివరించారు. వాటిలో కొన్ని స్థాలీపులాకంగా ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

నమ్మాళ్వారులు తిరువాయ్మొழி ప్రబంధం మొట్టమొదటి పాశురంలో భగవంతుని "ఉయర్ వఱ ఉయర్ నలముడైయవన్ "(తమకంటే గొప్పవైనది ఏదీ లేని విధంగా గొప్పవి అయిన ఆనందం మొదలైన కళ్యాణ గుణాలను సహజంగా కలిగినవాడు) అని నిర్దేశించారు. భగవంతుని గుణాలు ఇతరుల గుణాల వలె ఒక అవధిని కలిగినవి కాదు. ఉత్పత్తి వినాశాలను కలిగినవి కాదు. సహజమైనవి, అంతు లేని వైభవాన్ని కలిగినవి— అని ఈ సూక్తి లోని తాత్పర్యం. దేవతలు అందరిలో ప్రధానుడుగా, పరమాత్మచే సృష్టి ఆరంభంలో మొట్టమొదట సృష్టింపబడినవాడుగా, కనిపించే ఈ సృష్టిని అంతటినీ సృష్టించినవాడుగా చెప్పబడే బ్రహ్మ కూడా

పరిమితమైన, హెచ్చుతగ్గులను కలిగిన వైభవాన్ని కలవాడే. ఆ విధంగానే, త్రిమూర్తులలో ఒకడుగా చెప్పబడేవాడు, ప్రధాన కృత్యాలైన సృష్టి స్థితిలయాలలో ఒకటి అయిన సంహార కృత్యాన్ని నిర్వహించేవాడు అయిన పరమేశ్వరుడు కూడా ఈ విధంగా పరిమితమైన, ఉత్పత్తి వినాశాలను కలిగిన వైభవాన్ని కలవాడే. ఈ విషయం "యుగకోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పునః త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ" (వేలకోట్ల యుగాల కాలం విష్ణువును ఆరాధించి, బ్రహ్మ, మళ్లీ తాను ఈ ముల్లోకాలకు బ్రహ్మగా ఉండే స్థితిని పొందాదు— అని వింటున్నాము) అని, "మహాదేవః సర్వమేధే మహాత్మా హుత్వాత్మానం దేవదేవో బభూవ" (భారతం— రాజధర్మం —20— 12) (మహాత్ముడు అయిన మహాదేవుడు సర్వమేధయాగంలో తనను తాను ఆహుతి చేసుకొని దేవదేవుడు అయ్యాడు) అని, "విష్ణోరేషస్యావభృధే హవిర్భిః విదే హి రుద్రో రుద్రియం మహత్వమ్" (తాను తాను కోరిన అభిమతాలను పొందడం కోసం ప్రార్థించదగినవాడైన, విష్ణువునకు సంబంధించిన, ఆ విష్ణువునకు ప్రీతిని కలిగించే సర్వమేధం అనే యజ్ఞంలో మహాదేవుడు భగవత్ ప్రపదనద్వారభూతాలైన హవిస్సుల ద్వారా రుద్రుడు అయ్యే గొప్పతనాన్ని పొందాదు— అనే ఈ విషయం ప్రసిద్ధం కదా) (శ్రుతి) అని మొదలైన ప్రమాణాలు తెలియజేస్తున్నాయి. అందుచేత భగవంతుడైన శ్రీమన్నారాయణుని కళ్యాణగుణ వైభవాతిశయం సహజమైనది అని, మాటలకు, మనసుకు అందని విధంగా అవధి లేనిది అని ఇక్కడ ఆళ్వారులు పలికారు.

ఈ విషయాన్నే తైత్తిరీయ ఉపనిషత్తులోని ఆనందవల్లి "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" (వేదం భగవంతుని ఏ ఆనంద గుణాన్ని యొక్క అవధిని తెలియలేక, మనసుతో పాటు వాక్కులతో వెనుకకు తిరుగుతున్నదో) అని అంటూ తెలియజేసింది. పైన ప్రస్తావించిన తిరువాయ్ మొ, ళిసూక్తిని వివరిస్తూ నంబిళ్ళై అనే ఆచార్యులు ఈడు వ్యాఖ్యానంలో "భగవదానందత్తై పేశప్పుక్క వేదంగళ్

మనుష్యానందమ్ తుడంగి, బ్రహ్మానందత్తళవుమ్ శెన్రు, పిన్నైయుమ్, అవ్వరుకే ఉత్ప్రేక్షిత్తుక్కొండు, పరిచ్ఛేదిక్క మాట్లాదే, "యతో వాచో నివర్తంతే" ఎన్రు మీండనవిఱే. (భగవంతుని ఆనంద గుణాన్ని పరిచ్ఛేదించి పలకాలని ఆరంభించిన వేదాలు మనుష్యానందం నుండి ఆరంభించి, బ్రహ్మానందం వరకు వెళ్లి, ఆ తర్వాత కూడా, ఆ బ్రహ్మానందం తరువాత ఇంకా ఇంకా ఊహించి ఊహించి పలికినప్పటికీ, కూడా, ఆ భగవంతుని ఆళఆనంద గుణాన్ని లెక్క కట్టి పలుకలేక "యతో వాచో నివర్తంతే" అనే విధంగా వెనుకకు తిరిగాయి కదా) అని వివరించడాన్ని గమనించవచ్చు.

ఇంతే కాదు. ఇక్కడ ఆళ్వార్లు తమ అద్భుతమైన ఈ పదప్రయోగంద్వారా వేదపురుషుని హృదయాన్ని స్పషీకరించారు కూడా. ఆనందవల్లిలో మనకు వేదం భగవంతుని ఆనంద గుణాన్ని మాత్రం ప్రస్తావించి, దాని అపరిచ్ఛేద్యత్వాన్ని తెలియజేసింది. , భగవంతుని ఆనంద గుణమే కాదు, మిగిలిన గుణాలు అన్నీ కూడా ఇటువంటి స్వభావాన్ని కలిగినవే— అనే విషయం ఇక్కడ ఆనందవల్లిలో స్పష్టంగా గోచరించదు. అయితే, ఆళ్వార్ల సూక్తి ఆ విషయాన్ని కూడా మనకు తెలియజేయడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఈ అర్థాన్ని ఆళ్వార్లు ఒక అద్భుతమైన పదప్రయోగాన్ని చేయడం ద్వారా నిర్వహించారు— అని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు.

పైన ప్రస్తావించిన "నలముడైయవన్" అనే ప్రయోగాన్ని ఇక్కడ గమనించాలి. ఈ ప్రయోగంలో "నలమ్" అనే పదానికి రెండు అర్థాలు ఉన్నాయి. ఈ పదాన్ని గుణసామాన్య వాచకంగా, గుణ విశేష వాచకంగా— రెండు విధాలుగా గ్రహించవచ్చు. గుణ విశేష వాచకంగా గ్రహించినప్పుడు, ఈ "నలమ్" అనే పదం ఆనంద గుణాన్ని చెబుతుంది. అప్పుడు ఆనందగుణం మాత్రం అంతులేని వైభవాన్ని కలిగినది —అనే అర్థం స్పష్టమవుతుంది. ఈ విషయం ఇంతకుముందే వివరింపబడింది కదా.

ఇక, ఈ "నలమ్" అనే పదాన్ని గుణవిశేష వాచకంగా కాకుండా, గుణ సామాన్య వాచకంగా గ్రహించినప్పుడు, ఈ పదం ద్వారా భగవంతునకు కల అన్ని కళ్యాణగుణాలు చెప్పబడతాయి. ఈ గుణాలు అన్నీ అంతులేని, సహజసిద్ధమైన వైభవాన్ని కలిగినవి— అనే భావం పైన ఉట్టంకించిన "ఉయర్వఱ ఉయర్ నల ముడైయవన్" అనే సూక్తిలో స్పష్టపడుతున్నది. ఈ విధంగా ఇక్కడ ఆళ్వార్లు రెండు అర్థాలను ఇచ్చే "నలమ్" అనే శబ్దాన్ని ప్రయోగించడంద్వారా ఆనంద వల్లిలోని అర్థాన్ని చెప్పడమే కాక, అక్కడ స్పష్టంగా మనకు గోచరించని వేద తాత్పర్యాన్ని కూడా మనకు స్పష్టం చేశారు. ఇక్కడ "ఇగ్గుణంగళెల్లామ్ ఇప్పడియేయితే ఇరుప్పదు" (భగవంతుని ఈ గుణాలు అన్నీ కూడా ఈ విధంగానే అపరిచేద్యంగా ఉంటాయి కదా) అని నంబిళ్ళై వ్యాఖ్యాన సూక్తి. ఈ ఈడు వ్యాఖ్యానానికి కల అరుంబదవివరణంలో "భగవంతుని ఆనందం "ఇంతటిది "అని లెక్క కట్టడానికి సాధ్యం కానిది— అని చెప్పడానికి కారణం —ఆ గుణం యొక్క వైభవం లెక్క కట్టరానిది అయి ఉండడం చేత, భగవంతుని ఆనందం అపరిచ్ఛేద్యం— అని అన్నప్పుడే, ఆనంద గుణం అపరిచ్ఛేద్యం అని అనడానికి కారణమైన గుణాంతరాపరిచ్ఛేద్యత కూడా అర్థసిద్ధం— అని అర్థం— అని వివరింపబడడం గమనించవచ్చు. అంటే, భగవంతుని ఆనంద గుణం ఆపరిచ్ఛేద్యం అని చెప్పినందున, భగవంతుని మిగిలిన గుణాలు అన్నీకూడా ఆనంద గుణంవంటివే కనుక, వాటి అపరిచ్ఛేద్యత కూడా ఇక్కడ చెప్పబడినట్లే— అని తాత్పర్యం.

ఇక్కడ ఈ విధంగా గుణసామాన్యవాచకంతో గుణవిశేషాన్ని సూచించే ప్రక్రియలో నమ్మాళ్వారులు శ్రీరామాయణాన్ని అనుసరించారని చెప్పవచ్చు. తన ఆశ్రమానికి వచ్చిన నారద మహర్షిని ఉద్దేశించి వాల్మీకి మహర్షి "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్? (ఈ లోకంలో ఇప్పుడు గుణవంతుడైనవాడు ఎవడు?) అని ప్రశ్నించాడు. ఇక్కడ ఈ ప్రశ్నలోని "గుణవాన్" అనే పదంలోని గుణశబ్దాన్ని

వ్యాఖ్యాతలు గుణసామాన్యవాచకంగా గ్రహించి వ్యాఖ్యానించి, ఆ తరువాత దీనిని సౌశీల్యగుణపరంగా వ్యాఖ్యానించారు. అందుచేత పై నమ్మాళ్వారుల సూక్తి ఉపనిషత్సూక్తులతో సామ్యాన్ని కాక, వేదోపబృంహణమైన శ్రీరామాయణంలోని సూక్తితో కూడా సామ్యాన్ని కలిగి ఉన్నది.

ఇక్కడ ఇంకొక విశేషాన్ని కూడా నంబిళ్ళై తమ వ్యాఖ్యానంలో సూచించారు. వేదం మొట్టమొదట భగవంతుని ఆనంద గుణాన్ని లెక్క కట్టగలమని భావించి, అనేక విధాలుగా ఉత్ప్రేక్షించి ఊహించి, లెక్కించటానికి ప్రయత్నం చేసింది. కానీ, ఎంత లెక్క కట్టినా, తెలుసుకోలేక చివరకు వెనుకకు తిరిగింది. నమ్మాళ్వారులు ఆ విధంగా కాకుండా, ప్రారంభంలోనే భగవంతుని ఆనందగుణం— లెక్క కట్టి తెలియడానికి సాధ్యం కానిది— అనే విషయాన్ని గ్రహించి, దాని ప్రబంధ ప్రారంభంలోనే తెలియజేశారు. ఇది వేదానికి, ఆళ్వార్ల సూక్తికి మధ్య ఉండే వైలక్షణ్యం— అని నంబిళ్ళై అంటారు.

ఇటువంటి ఆసక్తికరమైన, ఆశ్చర్యకరమైన ఉపనిషత్సూక్తులకు, ఆళ్వార్ల శ్రీసూక్తులకు మధ్య ఉండే సామ్య వైలక్షణ్యాలను మన పూర్వాచార్యులు తమ గ్రంథాలలో ఎన్నో సందర్భాలలో స్పష్టం చేశారు.

నమ్మాళ్వార్లు ద్వితీయ శతక ప్రారంభ పాశురాన్ని అనుగ్రహిస్తూ, భగవంతుని “ఉమ్మియర్ వీడుడైయాన్” అని అంటారు. ఈ సూక్తిని వ్యాఖ్యానిస్తూ పెరియ వాచ్చాన్ పిళ్లై అనే ఆచార్యులు ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో “ఉంగళ్ ఆత్మావైయమ్, శరీరత్తైయుమ్ ఉడైయవన్” (ఈ ఆత్మను శరీరాన్ని తన సొత్తుగా కలిగినవాడు) అని అంటారు ఈ అర్థాన్నే బృహదారణ్యకోపనిషత్తు “యస్యాత్మా శరీరమ్, యస్య పృథివీ శరీరమ్” (5—7) (ఎవనికి ఆత్మ శరీరమో, పృథివి శరీరమో) అని పలికింది కదా.

ఈ దశకంలోనే ఇంకొక చోట, ఆళ్వారులు, భగవంతుని ఆశ్రయించమని ఉపదేశిస్తూ "ఎల్లైయిల్ అన్నలమ్ పుల్ కు" (4) (అంతులేని ఆనందగుణాన్ని స్వరూపంగా కలిగినవాడైన భగవంతుని ఆశ్రయించు) అని అన్నారు. ఇక్కడ ఈ సూక్తిలోని "నలమ్" అనే శబ్దం ఆనంద గుణాన్ని కాకుండా ఆనందగుణప్రచురుడైన భగవంతుని తెలుపుతుంది. ఈ విధంగా నిర్దేశించడం తైత్తిరీయ ఉపనిషత్తు ఆనందవల్లిలోని "అన్యోం ఽ తరాత్మా ఽఽ నందమయః" (5) అనే సూక్తిని అనువదించడమే అనే విషయాన్ని నంబిళ్ళై తమ వ్యాఖ్యానంలో స్పష్టం చేశారు. తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లి, "సత్యం చానృతం చ" (6) అని పరిణామాన్ని పొందే అచేతనాన్ని అనృతశబ్దంతోను, చేతనతత్వాన్ని సత్యశబ్దంతోను నిర్దేశించినట్లే ఆళ్వార్లు కూడా ఈ రెండిటిని "ఇల్లదుమ్, ఉళ్ళదుమ్"(3) అని నిర్దేశించడం గమనించవచ్చు ఇదే రీతిని విష్ణు పురాణం కూడా అనుసరిస్తూ "యదస్తి యన్నాస్తి చ" (2—6—39) చేతనాచేతనాలను అస్తినాస్తి శబ్దాలతో నిర్దేశించింది.

ఇటువంటి ఉపనిషత్సూక్తులకు, ఆళ్వారుల సూక్తులకు మధ్య ఉండే అర్థ సామ్యాలను ఎన్నిటినో మనం పూర్వాచార్యుల వ్యాఖ్యానాలలో గ్రంథాలలో దర్శించవచ్చు. విస్తరభీతి వల్ల ఇంతటితో ముగింపబడుతున్నది.



## కన్నతల్లి— పెంచిన తల్లి

**శ్రీవాగుక్తేః ప్రసూః శ్రీవకుళసుమధరః, స్యాచ్ఛ ధాత్రీ తదీయా**
**శ్రీమద్రామానుజః స్యాదితి సదసి విదాం వాక్ ప్రసిద్ధా గురూణామ్,**
**ఏవం శ్రీభాష్యమాతా భవతి యతిపతిః, దేశికో వేంకటేశో**
**ధాత్రీ భాతీతి వాక్చ ప్రవిలసతి తరాం జ్ఞాతవేద్యార్థగోష్ఠ్యామ్.**

(తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని కన్నతల్లి నమ్మాళ్వార్లు, ఆ ప్రబంధాన్ని పెంచి పెద్ద చేసిన తల్లి భగవద్రామానుజులు —అనే మాట పూర్వాచార్యుల సభలో ప్రసిద్ధమైనది. ఈ విధంగానే, శ్రీభాష్యం అనే మహా గ్రంథాన్ని కన్నతల్లి భగవద్రామానుజులు కాగా, దానిని పెంచి పెద్ద చేసిన పెంపుడు తల్లి వేదాంతదేశికులు అనే మాట కూడా తత్త్వవేత్తలైన మహనీయుల సభలో ప్రసిద్ధమైనది)

ఒక విషయాన్ని యథాతథంగా తెలియడానికి కారణం ఏదో, దానిని ప్రమాణమని అంటారు. యథాతథంగా తెలియబడేది ఏదో, దానిని ప్రమేయం అని అంటారు. ప్రమేయాలు అన్నిటిలో శ్రీమన్నారాయణుడు గొప్ప ప్రమేయం. అతడు, తనతో సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేని వాడు. ఆ పరమ పురుషుడు మన హితాన్ని దృష్టిలో పెట్టుకొని, ఉత్తరామధురానగరంలో దేవకీదేవికి పుత్రుడై అవతరించాడు. ఆ పరమ పురుషుడు అవతరించిన వెంటనే రేపల్లెలో యశోదా దేవి ఇంటికి చేరాడు. ఆ యశోదదేవి కూడా పరమ పురుషుడైన ఆ గోవిందుని పైన దోషాలను ఆరోపించి చెప్పేవారి మాటలను తిరస్కరించి, వారి నోరు మూయించి, ఆ స్వామిని తన వశం చేసుకొని, కంసుని అభిప్రాయాన్ని నిర్వీర్యం చేసి, ఆ శ్రీకృష్ణుడు పెరిగి పెద్దవాడై ప్రకాశించేటట్లు పెంచి రక్షించింది. ఈ విధంగా యశోదా దేవి శ్రీకృష్ణుడు పెరిగి పెద్దవాడు అయ్యేటట్లుగా చేసిన చరిత్ర ప్రసిద్ధమైనది. ఈ విషయాన్ని ఆళ్వారులు “ఏదేనుమ్ శొల్లి ఆశలత్తార్ ఏదేనుమ్ పేశ నాన్ కేట్క మాట్టేన్” (ఇరుగుపొరుగువారు మాట్లాడే అపనిందలన నేను వినలేను) అని, “దూశనుమ్

శొల్లుమ్ తొழுత్తైయారుమ్ తొండరుమ్ నిన్ఱ ఇడత్తిల్ నిన్ఱు" (దూషణ పలికేవారు, భక్తులు ఉండే చోట) అని, "అశోదై వళర్ క్కిన్ఱ శెయ్ త్తలై నీల నిఱత్తు చ్చిఱు ప్పిళ్ళై" (యశోదా దేవి పెంచే, పంటచేలలో వికసించే, నల్ల కలువ వర్ణాన్ని కలిగిన చిన్న కుర్రవాడు) అని కీర్తిస్తారు. ఈ విధంగా, గోవిందుడు అవతరించిన చోటు దేవకీదేవి, వృద్ధి చెందిన చోటుయశోదాదేవి అనేది స్పష్టం.

ప్రమాణాలలో చాలా గొప్ప ప్రమాణం అయిన తిరువాయ్ మొழி దివ్య ప్రబంధం అవతరించిన చోటు నమ్మాళ్వారులు. అది వృద్ధి చెందిన చోటు భగవద్రామానుజులు. శ్రీరంగం అనే దివ్య క్షేత్రంలో ఆదిశేషునిపై శయనించి ఉండే శ్రీరంగనాథునకు మిగిలిన అర్చామూర్తులు అందరి కంటే ఒక విలక్షణమైన గొప్పతనం ఉన్నది. ఆ గొప్పతనాన్ని "తెన్నాడుమ్ వడనాడుమ్ తొழ నిన్ఱ తిరువరంగమ్" (దక్షిణ దేశంలో, ఉత్తరదేశంలో ఉండేవారు అందరూ కొలిచేటట్టుగా ఉండే శ్రీరంగం) అని అంతటా కీర్తించడం మనకు అందరికీ తెలుసు. నమ్మాళ్వారులకు మిగిలిన ఆళ్వార్లు అందరి కంటే మిక్కిలి గొప్పతనం ఉన్నది. ఆ గొప్పతనాన్ని "ఉండో శడగోపర్ క్కు ఒప్పోరువర్?" (శఠకోపులకు సాటి వచ్చేవారు ఎవరు?)అనే ఉపదేశరత్తినమాలైసూక్తిలో మనం చక్కగా తెలియవచ్చు. ఈ విధంగా, సాటి లేనివారుగా కీర్తింపబడేవారు నమ్మాళ్వారులు. శ్రీరంగనాథుని విషయంగా కలిగిన తిరువాయ్ మొழி ప్రబంధాన్ని కన్నతల్లి వీరు. కష్టపడి కన్నకుమారుని పెంచి పెద్ద చేసే పెంపుడు తల్లివలె, తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పెంచి పెద్ద చేసిన పెంపుడు తల్లి, భగవద్రామానుజులు. నమ్మాళ్వార్లు అవతరించి, తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పాడి పరమపదాన్ని చేరిన తరువాత, వేదాలను ప్రమాణంగా అంగీకరించని బాహ్యమతాలవారు, వేదాలను ప్రమాణంగా ఒప్పుకున్నప్పటికీ, ఆ వేదాలకు విపరీతంగా అర్థాలను పలికే ఇతర మతాలవారు తిరువాయ్ మొழிని అంతరించేటట్లు చేసే విషయాన్ని గమనించి, శ్రీభాష్యం మొదలైన గ్రంథాలను రచించడం ద్వారా ఒక

విధంగా వారి ప్రయత్నాలను అడ్డుకొని, శ్రీ భాష్యం మొదలైన దివ్యశాస్త్రాలను ఆ తిరువాయ్ మొழி ప్రబంధానికి రక్షగా పెట్టి, తమ వశం చేసుకొని, తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ ద్వారా ఆ తిరువాయ్ మొழி ప్రబంధంలోని అర్థాలను వ్యక్తం చేయించి, ఈ విధంగా ఆ దివ్యప్రబంధాన్ని వృద్ధి చేసినవారు, భగవద్రామానుజులు. ఈ విషయాన్ని పరాశర భట్టర్ తిరువాయ్ మొழி ప్రబంధానికి తనియన్ పాశురంగా అనుగ్రహించిన

**"వాన్ తిగழுమ్ శోలై మదిళరంగర్ వణ్ పుగழ் మేల్**
**ఆన్ఱ తమిழ் మఱైకళ్ ఆయిరముమ్—, ఈన్ఱ**
**ముదల్ తాయ్ శడగోపన్ మొయ్ మ్బాల్ వళర్ త్త**
**ఇదత్తాయ్ ఇరామానుశన్"**

(ఆకాశం అంత ఎత్తును కలిగి ప్రకాదించే తోటలను, ప్రాకారాలను కలిగిన శ్రీరంగంలో నెలకొని ఉన్న శ్రీ రంగనాథుని కళ్యాణ గుణాలను ఉద్దేశించి ప్రవర్తించిన వేయి ద్రావిడ పాశురాలను కలిగిన తిరువాయ్మొழி ప్రబంధాన్ని కన్నతల్లి నమ్మాళ్వారులు. దానిని చక్కగా పెంచి పెద్ద చేసిన హితపరురాలైన పెంపుడు తల్లి శ్రీరామానుజులు)

అనే పాశురం ద్వారా అనుభవించవచ్చు.

ఈ విధంగా తిరువాయ్ మొழி దివ్య ప్రబంధానికి నమ్మాళ్వార్లు కన్నతల్లిగా, భగవద్రామానుజులు పెంచ పెద్ద చేసిన తల్లిగా ఉన్నట్లే, శ్రీభాష్యం మొదలైన దివ్యశాస్త్రాలకు భగవద్రామానుజులు కన్నతల్లిగా, శ్రీవేదాంతదేశికులు పెంచి పెద్ద చేసిన పెంపుడు తల్లిగా ప్రకాశిస్తున్నారు.

నాథముని మొదలుగా ఉండే మన ఆచార్యులలో భగవద్రామానుజులకు విలక్షణమైన అతిశయం ఉన్నది. "లక్ష్మీనాథుడైన నారాయణుడే చాలా గొప్ప పరదైవం" అనే తత్వాన్ని, ఆ పరమాత్మ విషయంలో చేసే భక్తి, ప్రపత్తులే ఉపాయం అనే హితాన్ని, ఆ పరమాత్మను అనుభవించి కైంకర్యం చేసి ఆనందింపజేయడమే

ఉత్తమమైన శ్రేయస్సు అనే పురుషార్థాన్ని తెలియజేస్తున్నది, విశిష్టాద్వైతమతం. ఇది, చాలా గొప్ప ప్రమాణమైన వేదం వల్ల సిద్ధించిన మతం. అందువల్ల ఇది వైదికం అని, అనాది అని కీర్తింపబడుతున్నది. అయినప్పటికీ, ఆయా కాలాలలో ఈ మతం బాహ్యమతాల వల్ల, కుదృష్టి మతాలవల్ల కొంతకాలం ఇది అంతర్ధానమైనది. అటువంటి సందర్భంలో భగవద్రామానుజులు అవతరించి, శ్రీ భాష్యం మొదలైన దివ్యశాస్త్రాలతో, తమ ఉపదేశాలతో దీనిని చాలా ప్రచారం పొందేటట్లు చేశారు. అందుచేత ఈ సిద్ధాంతానికి భగవద్రామానుజ దర్శనం అని వారి పేరును పురస్కరించుకునే శ్రీరంగనాథుడు పేరు పెట్టాడు. ఈ కారణంచేత, "ఆముదల్వన్" అని శ్రీయామునులచేత కటాక్షింపబడ్డారు, భగవద్రామానుజులు అని ఉన్నందున, వీరి గొప్పతనం చక్కగా ప్రకాశిస్తున్నది. పూర్వాచార్యులు అనే రత్నాలతో కూర్చబడిన హారంలో నాయకమణి స్థానంలో భగవద్రామానుజులు ప్రకాశిస్తున్నారు. "యతిరాజేన నిబద్ధనాయకశ్రీః" (శ్రీరామానుజుల వల్ల నాయకరత్న శోభను కలిగినది) అని యతిరాజసప్తతిలో వేదాంతదేశికులు ఈ విషయాన్ని అనుగ్రహించినందునకూడా శ్రీ రామానుజుల వైభవం స్పష్టమవుతున్నది.

ఈ విధంగా భగవద్రామానుజుల వల్ల అవతరించిన శ్రీభాష్యం మొదలైన దివ్యశాస్త్రాలకు తమ ఉపదేశాలతోనూ, తత్త్వటీక, అధికరణసారావళి, శతదూషణి మొదలైన అత్యాశ్చర్యకరాలైన దివ్యగ్రంథాలతోనూ ప్రకాశాన్ని కలిగించి, శ్రీరామానుజ దర్శనాన్ని మరింత మరింత అభివృద్ధి చేసినవారు, శ్రీవేదాంత దేశికులు, అందుచేత వీరు దానిని పెంచి పెద్ద చేసిన పెంపుడు తల్లి అయ్యారు.

ఈ రీతిలో భగవద్రామానుజ దర్శనానికి కన్నతల్లి శ్రీరామానుజులు, పెంపుడు తల్లి శ్రీదేశికులు— అనే ఇద్దరు ఆచార్య రత్నాలను పొందిన శ్రీవైష్ణవులమైన మనకు ఏ కొరతా లేదు. మనం, మన స్వరూపానికి తగినట్లు ఈ ఇద్దరు మహనీయులను సేవించి, ధన్యులం అవుదాం. స్వస్తి.

## పురిశై శ్రీరంగాచార్యస్వామివారి వైభవమ్

శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని రక్షించి, పోషించిన మహనీయుల గోష్ఠిలో విలక్షణమైన స్థానాన్ని అలంకరించి, ప్రకాశించేవారు– ఉ. వే. శ్రీమాన్ తిరుమలై ఆనందాణ్ పిళ్లై పురిశై శ్రీరంగాచార్యస్వామివారు. ఈ మహాపురుషులు కలియుగాది 4945 వ సంవత్సరంలో, శోభకృత్ సంవత్సరం పంగుని మాలామూలా నక్షత్రంలో అవతరించారు. ఈ సంవత్సరం శోభకృన్నామ సంవత్సరం కదా. ఈ సంవత్సరం పంగుని మాసం మూలానక్షత్రంనాటికి వారు అవతరించి 180 ఏళ్ళు అవుతుంది. ఈ మహనీయులు శ్రీవేంకటేశ్వరుని నిత్యకైంకర్యాన్ని చేయడం మూలంగా ప్రమేయ రక్షణను, జగద్గురు గాధి అనంతాచార్య స్వామి, కపిస్థలం దేశికాచార్యస్వామి, ఇంజిమేడు రంగాచార్య స్వామివంటి సుప్రసిద్ధ విద్వాంసులను సిద్ధపరచడం ద్వారా ప్రమాతృరక్షణాన్ని చేశారు. వీరు చేసిన ప్రమాణ రక్షణం అతి విలక్షణమైనది. మన వాక్కుకు అందనిది. వేదాలు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, తర్కం, వ్యాకరణం, మీమాంస వేదాంతం అనే నాలుగు శాస్త్రాలు, సాహిత్యం, అలంకార శాస్త్రం, ధర్మశాస్త్రం, మంత్రశాస్త్రం అనే అన్ని విభాగాలలోను అపారమైన పాండిత్యాన్ని కలిగినవారు, వీరు. వీరి పాండిత్యానికి సాక్షిగాను, విజయస్తంభాలుగాను ప్రకాశిస్తున్నాయి, వీరు అనుగ్రహించిన దివ్య గ్రంథాలు.

"ఈ మహాపురుషులు 130కి మించి గ్రంథాలు అనుగ్రహించినట్లుగా పెద్దలు చెబుతున్నారు "అని వరంగల్ రఘునాథాచార్య స్వామివారు అనేవారు. మంజుభాషిణి పత్రికలోను, రామానుజన్ లో, ఇంకా అమృతలహరిలోనూ ప్రకాశింపజేయబడిన ఈ మహానుభావుల దివ్య గ్రంథాలలో ఇంచుమించుగా 40 గ్రంథాలు నిర్దేశింపబడ్డాయి. అయినప్పటికీ, ఈనాడు మనకు 18 గ్రంథాలు మాత్రం

లభిస్తున్నాయి. వాటిలో కూడా, ఐదు గ్రంథాలు అసంపూర్తిగానే, కొన్ని కొన్ని అయితే, భాగాలుగా మాత్రమే లభిస్తున్నాయి.

పరమవైదికమైన మన శ్రీవైష్ణవ సిద్ధాంతానికి విరుద్ధంగా ఎవరైనా ఒక భాగం లేవదీస్తే, దానిని ఖండించడంలో మొట్టమొదటి వరుసలో ఉండేవారు, ఈ మహానుభావులే. వేదంలో అర్చావతారం ప్రస్తావించబడలేదని, అర్చామూర్తి పూజనం అవైదికం అని ఆర్యసమాజానికి చెందిన దయానంద సరస్వతి అనేవారు ప్రచారం చేయగా, దానిని పూర్తిగా ఖండించి, వేదమార్గ మీమాంస అనే గ్రంథాన్ని అనుగ్రహించారు. ముక్తికి ముఖ్య మార్గమై, పరమధర్మమైన తప్తచక్రాంకనం కూడదని వాదించేవారిని ఖండిస్తూ, భగవద్ధర్మ దర్పణం అనే అద్భుతమైన గ్రంథాన్ని అనుగ్రహించారు. ప్రయాగ, పాట్నా మొదలైన క్షేత్రాలలో ఉండే కొందరు శైవులు శ్రీవైష్ణవ మతాన్ని దూషించగా, వారికి బదులుగా పాషండి దండనం అనే ఒక గొప్ప గ్రంథాన్ని రచించారు. అంతేకాక, శ్రీభాష్యాదులలో ప్రతిపాదింపబడిన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని కొందరు అద్వైతులు దూషించగా, దానికి పరిహారంగా కుదృష్టిధ్వాంత మార్తాండం, వాదిప్రశ్నసమాధి మొదలైన గ్రంథాలను అవతరింపజేశారు. ఉపాకర్మను గూర్చి కొన్ని సందేహాలు లేవగా, ఆ సందేహాలను తీర్చడం కోసం, స్పష్టంగా విషయాన్ని తెలియజేయడం కోసం నిర్ణయసుధాసముద్రం అనే అత్యాశ్చర్యకరమైన గ్రంథాన్ని రచించారు. ఇంకా, కైవల్య నిర్ణయాన్ని చేస్తూ చాలా పెద్ద గ్రంథమైన కార్యాధికరణవాదం అనే గ్రంథాన్ని, వాధూల గోత్ర ప్రవర విషయంగా వివాదం లేవగా, వాధూల గోత్ర దీపిక అనే గ్రంథాన్ని, వాధూల ప్రవరదీపికోద్ద్యోతమ్ అనే ఈ రెండు గ్రంథాలను ఈ మహనీయులు రచించారు. తర్కశాస్త్ర రసికులను ఆనందింప చేయడం కోసం వారికి భోగ్యంగా సువర్ణవాదం, విశేషణత్రయ విచారం మొదలైన గ్రంథాలు చాలా ఈ మహానుభావుల చేత రచింపబడ్డాయి.

ఇవి అన్నీ ఒక వైపు ఉండగా, భగవద్గుణానుభవరసికులకు భగవత్ స్తోత్ర ప్రియులకు అమృతం అనదగిన ఎన్నో స్తోత్రాలను వీరు అనుగ్రహించారు. ప్రపంచ ప్రసిద్ధమైన పద్మావతి గద్యం, శ్రీనివాస గద్యం అనే రెండు స్తుతి గ్రంథాలను వీరు రచించారు. ఈ రెండు గద్యలవంటి గద్యప్రబంధాలు అంతకుముందు రచింపబడలేదు, ఇకమీదట రచింపబడే అవకాశం లేదు— అని కీర్తించేటట్లుగా వీటి వైభవం ఉన్నది. ఉజ్జ్వల వేంకటనాథ స్తోత్రం, ద్వారకానాథ స్తోత్రం, సాలగ్రామ స్తుతి అనేవి వీరిచే రచింపబడినవే. ఇంతే కాక, తిరుప్పావై దివ్య ప్రబంధాన్ని సంస్కృతంలో అనువాదం చేస్తూ శ్లోకరూపంగా వీరు రచించారు. ఈ దివ్య గ్రంథం "గోదా శ్రీ వ్రత ప్రబంధ సంస్కృతప్రతికృతి" అని పిలువబడుతున్నది. ఒక్కొక్క పాశురానికి రెండేసి స్రగ్ధరావృత్తాల చొప్పున ఇందులో మొత్తం 60 శ్లోకాలు ఉన్నాయి. ఈ విధంగానే, ఇంకా ఎన్నో గ్రంథాలు ఈ మహానుభావులు అనుగ్రహించారు. ఇవి ఆ కాలంలో సంస్కృత లిపిలో, తెలుగు లిపిలో ఇంచుమించుగా ప్రచురింపబడినవి. కొన్ని గ్రంథాలు గ్రంథలిపిలోనూ, తెలుగులిపిలోనూ రాతప్రతిలో పెద్దల తిరుమాళిగలలో మరికొన్ని రక్షింపబడుతున్నాయి.

ఈ విధంగా, ఈ మహనీయుల చేత రచింపబడిన, సముద్రంవలె విస్తరించిన గ్రంథజాతంలో చాలా గ్రంథాలు ముద్రింపబడకుండా ఉన్నాయి. ముద్రింపబడిన వాటిలో కూడా, కొన్ని గ్రంథాలు పూర్తిగా లభించడం లేదు అయినా, లభించిన గ్రంథాలను సేకరించి చక్కని రీతిలో దేవనాగరి రీతిలో ముద్రించి పురిశై మహాస్వామి గ్రంథమాలికగా తిరిగి ముద్రించవలసిన ఆవశ్యకత ఉన్నది. లభించిన గ్రంథాల పరిమితిని చూస్తే, అవే వేయి పుటలకు పైగా ఉన్నవి. వేదాలు, ఉపబృంహణాలు, వేదాంతశాస్త్రం, ధర్మశాస్త్రం, తర్కశాస్త్రం, సాహిత్యం అనే ఈ విభాగాలలో ఈ మహనీయులు అనుగ్రహించిన గ్రంథాలను విలక్షణమైన రీతిలో మహాగ్రంథమాలికగా ముద్రించి, వారి 108వ తిరునక్షత్ర మహోత్సవంలో వారి

సన్నిధిలో సమర్పించి, వారి విషయంలో కృతజ్ఞతా స్మృతిని చేసేటట్లుగా వేంకటేశ్వర స్వామి, ఆ మహనీయులు, శ్రీ వైష్ణవ భాగవతలోకం అంతా మంగళాశాసనం చేయాలి.

★★★★

# వేదార్థసంగ్రహమ్(సారమ్)

(ఉ. వే. శ్రీమాన్. కోయిల్ విద్వాన్ నరసింహాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

అజ్ఞానాన్ని మాత్రమే కలిగించే ఈ విశాలమైన ప్రపంచంలో మనం అనుభవించే ఆనందాలు అల్పమైనవి, సారం లేనివి, చిరకాలం నిలువనివి, దుఃఖాలతో కూడినవి, ఆత్మకు స్వరూప నాశం కలిగించేవి. ఈ జీవుడు బ్రహ్మానుభవాన్ని పొందడానికి పెట్టి పుట్టినవాడు. దానిని పొందే ఉపాయం ఏదంటే, అది వేదాంత జ్ఞానమే. ఆ వేదాంత జ్ఞానం ప్రస్థానత్రయాన్ని ఆచార్యుని దగ్గర అధ్యయనం చేస్తే ఏర్పడుతుంది.

ప్రస్థానత్రయం అంటే— బ్రహ్మసూత్రభాష్యం, ఉపనిషద్భాష్యం, గీతాభాష్యం అనేవి. శంకరులు, ఆనందతీర్థులు ఉపనిషత్తులకు చాలా విస్తృతమైన భాష్యాలను రచించారు. మన స్వామి శ్రీరామానుజులు ఉపనిషత్తులకు విస్తృతమైన వ్యాఖ్యానాన్ని రచించలేదు. అందుచేత ముఖ్యమైన వేదాంతవాక్యాలను విచారించి చూచి, వాటి జ్ఞానాన్ని అనుగ్రహించారు. ఆ జ్ఞానాన్ని అనుగ్రహించే గ్రంథమే వేదార్థసంగ్రహం. అంటే, వేదంలోని అర్థాలలోని సంగ్రహం అని కానీ, వేదాంతార్థాలలోని సంగ్రహం అని కానీ దీనికి అర్థం చెప్పవచ్చు. నవరత్నాలవంటి, శ్రీరామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు 9 లో ఇది ఒకటి.

ఈ వేదార్థసంగ్రహం ఆరంభంలో శ్రీ రామానుజులు అనుగ్రహించిన మంగళ శ్లోకం ఇది—

**1)"అశేషచిదచిద్వస్తుశేషిణే శేషశాయినే,**
**నిర్మలానందకళ్యాణనిధయే విష్ణవే నమః".**

చేతనాచేతనాలకు స్వామియై, ఆదిశేషునిపై శయనించి ఉండేవాడై, ఏ దోషం లేనివాడై, కల్యాణ గుణాలకు ఆకరమై, అన్ని వస్తువులలో ఆత్మయై వ్యాపించి ఉండే పరదేవత అయిన నారాయణునకు శేషమైన నేను, నాకు చెందినవాడను కాను —అని దీని అర్థం.

(అశేషచిదచిద్వస్తుశేషిణే శేషశాయినే) ఉభయ విభూతులను కలిగినవాడు అని, చేతనాచేతనాలకు స్వామి అని అన్నందున చేతనాచేతన ఈశ్వరభేదం,

(నిర్మలానందకళ్యాణనిధయే) అని అన్నందున నిస్సమాభ్యధికమైన జ్ఞానాన్ని కలవాడు అని తెలియజేయబడినట్లు అయినది.

వేదార్థసంగ్రహంలోని రెండవ ప్రార్థనాశ్లోకం.

**2)పరం బ్రహ్మైవాజ్ఞం భ్రమ పరిగతం సంసరతి తత్**
**పరోపాధ్యాలీఢం వివశ మశుభస్యాస్పదమితి,**
**శృతిన్యాయాపేతం జగతి వితతం మోహనిబిడం**
**తమో యేనాపాస్తం స హి విజయతే యామునమునిః.**

బ్రహ్మ తప్ప ఏదీ లేదు. అంతా మిథ్య.

1) బ్రహ్మం అనేది అవిద్యను కలిగినది, అది అవిద్యచేత ఆవరింపబడినది. అవిద్య చేత పలు వస్తువులుగా కల్పింపబడుతున్నది. బ్రహ్మం భ్రమను కలిగినది. జన్మం, మరణం మొదలైన దుఃఖాలను అనుభవిస్తున్నది.

2) బ్రహ్మమే నిజం. మిగిలినవి శరీరం, ఇంద్రియాలు అనే ఉపాధి వల్ల అది భేదాన్ని పొందుతున్నది. కర్మవశమైనది, అశుభాలకు ఆశ్రయం— అని చెప్పబడే అజ్ఞానాంధకారాన్ని పోగొట్టిన యామునాచార్యులవారు ప్రకాశిస్తున్నారు. వారిని నేను ఆశ్రయిస్తున్నాను— అనేది పై శ్లోకంలోని అర్థం.

ఈ శ్లోకవివరణమే మిగిలిన వేదార్థసంగ్రహం అంతాకూడా.

1)శాంకరమతం

౧) బ్రహ్మం అనేది రూపం, గుణం, విభూతి అనే ఏ విధమైన విశేషాలు లేనిది, జ్ఞానమయంగా ఉండేది, స్వయంప్రకాశకమైనది.

౨) ఆ బ్రహ్మం అవిద్య వల్ల ఆవరింపబడి, విపరీతజ్ఞానాన్ని పొంది, పలు వస్తువులను తెలిసికొంటున్నది.

౩) బ్రహ్మం ఒక్కటే స్వయం ప్రకాశకమైనది. అదే వాస్తవమైనది. మిగిలినది అంతా కూడా అసత్యం. అవిద్యవల్లనే భాసిస్తున్నది.

2) భాస్కర మతం

బ్రహ్మం ఏ విధమైన విశేషం లేనిది కాదు. గుణం ఉన్నది. బుద్ధి, ఇంద్రియాలు, దేహం మొదలైన సత్యమైన ఉపాధి సంబంధంచేత జన్మమరణ దుఃఖాలను పొందుతున్నది.

3) యాదవప్రకాశమతం

౧) బ్రహ్మమే చిత్తుగాను, ఆచిత్తుగాను పరిణామాన్ని పొందుతున్నది.

౨) చేతనుడు అశుభమైనవాడు, అపురుషార్థ సంబంధాన్ని కలవాడు.

౩) అచేతనం అశుభమైనది, పరిణామాన్ని పొందేది.

౪) తనకంటే వేరు కానివానిని వేరు అని భావించి, భ్రమించి, దానివల్ల సంసారంలో జననమరణదుఃఖాలను పొందుతున్నది.

4) మీమాంసకమతం

వేదార్థసంగ్రహమ్(సారమ్)

A) భాట్టమతం

౧) కర్మం అనేది దేవతలను ఉద్దేశించి హవిస్సును సమర్పించి, ఫలాన్ని పొందడానికి ఉపాయమై ఉన్నది.

౨) ఆ కర్మలు— పుత్రులు, పశువులు, అన్నం, వర్షం, స్వర్గము మొదలైన అల్పమైన అస్థిరమైన ఫలాలను ఇస్తున్నాయి.

౩) దేవతలు అనేవారు లేరు. అంటే, దేవతలకు రూపం, హవిస్సును గ్రహించడం, పలు కర్మలు జరిగే చోట్లకు ఒకే కాలంలో రావడం అనేవి ఇవి లేవు.

౪) కర్మలే ఫలాన్ని ఇస్తున్నాయి.

B) ప్రాభాకరమతం

౧) కర్మం ఫలాన్ని ఇవ్వడం లేదు. అపూర్వం(ఇది ప్రాభాకరుడు కల్పించినది) ఫలాన్ని ఇస్తున్నది.

"వేదోఽ ఖిలో ధర్మమూలమ్", "వేదాః ప్రమాణమ్", "ఆదౌ వేదాః ప్రమాణమ్" అనే విధంగా పరమ ప్రమాణమైన వేదాలకు విరుద్ధమైన అభిప్రాయాలను చెప్పే ఈ మతాలను ఖండించి, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని శ్రీరామానుజులు స్థాపించారు.

"తత్ త్వమ్ అసి" అనేది ఛాందోగ్యోపనిషత్ వాక్యం. ఆ బ్రహ్మం నీవే, "నేతి నేతి" అని వేదం చెబుతున్నందున, బ్రహ్మ తప్ప మిగిలినవి లేనే లేవు. అంతా మిథ్య. బ్రహ్మం భ్రమాన్ని పొందుతున్నది. అంటే, ఒకడు ముత్యపు చిప్పను చూచి వెండి అని మారుగా భావిస్తున్నాడు. ఈ భ్రమలో ముత్యపు చిప్ప నిజం. వెండి అసత్యం. ఆ విధంగానే, చిత్తు అనేది లేదు. అచిత్తు అనేది లేదు. ప్రపంచం అసత్యం. బ్రహ్మం అవిద్య చేత ఆవరింపబడుతున్నది. వాస్తవంలో లేని చేతనాచేతనమయమైన ప్రపంచాన్ని ఉన్నట్లుగా భావిస్తున్నది. మత్యపుచిప్పను చూచి వెండి అని భ్రమిస్తున్నాడు. వెంటనే

“నేదం రజతం” — ఇది వెండి కాదు— అని భ్రమ తొలగుతున్నది. ఆ విధంగానే, బ్రహ్మం అనేది అవిద్య చేత భ్రమను పొంది, అసత్యమైన లోకాన్ని సత్యంగా భావించి, భేదదర్శనాన్ని పొందుతున్నది, బ్రహ్మకు కలిగిన ఈ భేదదర్శనానికి అవిద్యే కారణం, ఈ అవిద్య తొలగడం “తత్ త్వమ్ అసి” మొదలైన, “బ్రహ్మ, ప్రపంచం ఒకటే” అని తెలిపే అద్వైతజ్ఞానం చేతనే ఏర్పడుతుంది.

తత్— సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం మొదలైన పలు గుణాలతో కూడిన బ్రహ్మంగా,

త్వమ్— అజ్ఞానం, ఆశక్తి మొదలైనవానితో కూడిన జీవుడవైన నీవు

అసి— ఉన్నావు—

అనే అర్థం గ్రహిస్తే, ఒకదానికి ఇంకొకటి వేరుపడిన బ్రహ్మం, జీవుడు అనే రెండు వస్తువులు ఒకటిగా అయ్యే అవకాశం లేదు. అందుచేత,

తత్— అంటే సర్వజ్ఞత్వం మొదలైన విశేషాలను విడచి బ్రహ్మం అని మాత్రం అర్థం.

త్వమ్— అనేదానికి జీవుడు అని మాత్రం అర్థాన్ని గ్రహించాలి. “నీవే బ్రహ్మగా ఉన్నావు” అని అర్థాన్ని గ్రహించడమే తగినది. బ్రహ్మం తప్ప మిగిలినది అంతా అసత్యం. బ్రహ్మమే తనను జీవుడు అని భావిస్తున్నది. జీవబ్రహ్మల ఐక్యాన్ని తెలిపే వాక్యంచేత ఏర్పడే జ్ఞానంవల్ల భ్రమ తొలగుతున్నది, ఏ విధంగా అంటే, వెండి అనే భ్రమ “ఇది వెండి కాదు” అనే జ్ఞానంచేతనే తొలగినట్లుగా.

దీనికి మన స్వామి భగవద్రామానుజుల ఖండనం ఏమంటే—

“అవిద్యచేత బ్రహ్మం భ్రమిస్తున్నది” అనేదానిని వారు పలు విధాలుగా ఖండించారు.

1) “అవిద్య బ్రహ్మాన్ని ఆవరిస్తున్నది అనేది” ఎంత మాత్రం పొసగదు.

ఆవరిస్తున్నది— అని అంటే, స్వయంప్రకాశకమైన. బ్రహ్మంలోని ప్రకాశాన్ని అడ్డుపడుతున్నట్లు అవుతున్నది. బ్రహ్మమేకదా ప్రకాశం. దానిని ఆవరిస్తే, ఇక బ్రహ్మమే లేనిది అవుతుంది.

2) అసలు అవిద్య అనేదే నిలువదు.

౧) అవిద్య వాస్తవమా? అసత్యమా? నిజమైతే, అంతా మిథ్య అనే మీ మతసిద్ధాంతానికి విరోధం వస్తుంది.

౨) అసత్యం అని అంటే, అది బ్రహ్మాన్ని ఆవరించడం సాధ్యం కాదు. అసత్యమైన జలం దాహాన్ని తీర్చగలదా?

అందుచేత,

తత్— సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం, సర్వాయతనత్వం మొదలైన గుణాలతో కూడిన ఆ బ్రహ్మగా,

త్వమ్— అజ్ఞుడవై, ఆశక్తుడవై ఉండే నీవు,

అసి— ఉన్నావు— అనే అర్థాన్ని గ్రహించాలి

ప్రశ్న—అజ్ఞానమైన వస్తువు సర్వజ్ఞం అయ్యే అవకాశం లేదే?

సమాధానం— విరోధం వస్తుందే —అని భావించవద్దు.

౧) వేదం చేతనాచేతనాలను అన్నిటిని బ్రహ్మకు శరీరం అని అంటున్నది.

1) "యస్య పృథివీ" శరీరం అని ఆరంభించి ఎస్యత్మ శరీరం అనే వరకు రచయితనాలను చేతనాలను భగవంతుని శరీరం అని అంటున్నది.

జీవుడు శరీరం. పరమాత్మ శరీరిసుమా!. శరీరానికి ఒక ఆత్మ ఉన్నట్టుగానే, ఆత్మను శరీరంగా చేసికొని, దానిలో పరమాత్మ ఆత్మగా ఉన్నాడు.

అజ్ఞుడవై, అశక్తుడవై ఉండే నిన్ను శరీరంగా కలిగిన ఆత్మ సర్వజ్ఞుడై, సర్వశక్తియై, సర్వాయతనుడై ఉండే బ్రహ్మం— అనే అర్థం సిద్ధిస్తున్నది.

2)పంచభూతాత్మకమైన శరీరంలో ఉండే చిన్నతనం, బలం, వార్ధక్యం మొదలైన దోషాలు ఆ శరీరంలో ఉండే జీవాత్మకు సోకనట్లుగానే, శరీరమైన చేతనాచేతనాల దోషాలు బ్రహ్మానికి అంటవు. ఈ విధమైన సమన్వయాన్ని సామానాధికరణ్యంతో స్వామి సాధించారు.

3) సామానాధికరణ్యం — అనేకవిశేషాలు కలిగిన పదార్థాలతో కూడిన ఒకే వస్తువు. లేక, వేరు వేరు విధమైన వస్తువులు అన్నీ ఒకే వస్తువును నిర్దేశించడం.

"నీలో ఘటః" —(నల్లని కుండ,) వర్ణం, కుండ అనేవి ఒకే వస్తువుగా ఇక్కడ చూపబడుతున్నవి.

"బ్రహ్మా చ నారాయణః, శివశ్చ నారాయణః" మొదలైనవి కూడా ఇక్కడ ఉదాహరణాలు.

నమ్మాళ్వారుల

**"నీరాయ్ నిలనాయ్ తీయాయ్ కాలాయ్ నెడు వానాయ్**
**శీరార్ శుడర్ కళ్ ఇరండాయ్ శివనాయ్ ఆయనానాయ్"**

అనే సూక్తి ఇటువంటిదే.

వీరు ప్రత్యక్షాన్ని రెండుగా వర్గీకరించి పలుకుతున్నారు.

1)నిర్వికల్ప ప్రత్యక్షం

2)సవికల్ప ప్రత్యక్షం

నిర్వికల్పం— మొదట ఒక వస్తువు మాత్రం ఏ విధమైన విశేషం లేకుండా భాసిస్తుంది.

సవికల్పం —తరువాత చూచేటప్పుడు ఒక వస్తువు విశేషాలతో గోచరిస్తుంది.

మొదట నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మం మాత్రం గోచరిస్తుంది.

తరువాత విశేషాలు గోచరిస్తాయి. అవిద్య చేత ఇవి కల్పించబడినవి అని అంటారు. జ్ఞానం అంటే నిర్విశేషంగానే తోస్తుంది. జ్ఞానం కలిగేటప్పుడు కర్త, కర్మ — అనే వీటితో కలిసే తోస్తున్నది. దీనికి ఉదాహరణం—

"అహం ధావామి". (నేను పరిగెడుతున్నాను)

"కులాల ఘటం కరోతి "(కుమ్మరి కుండను చేస్తున్నాడు)

రెండవ ప్రత్యక్షంలో జ్ఞానం ఏర్పడేటప్పుడు విశేషాలతో తెలియడానికి కారణం నిర్వికల్పం. మొదట నిర్వికల్పంలో విశేషమే లేకుండా ఉన్నట్లయితే, సవికల్పంలో ఏ విధంగా విశేషం తోస్తుంది?

3) జాతి అనేది కంటికి కనిపించదు.

కుండలో ఘటత్వం అనే జాతి ఉన్నది.

పశువులో గోత్వం అనే జాతి ఉన్నది.

బ్రాహ్మణునిలో బ్రాహ్మణత్వం అనే జాతి ఉన్నది.

ఇది "అయం ఘటః అయం ఘటః" అని అనువర్తించి కలిగే జ్ఞానంతో తెలియపడుతున్నది— అని చెప్పడం తప్పు.

జాతి అనేది ఒక రూపసన్నివేశం.

మొదట గోవును చూసినప్పుడు, దాని కొమ్ములు, కంఠం మొదలైనవాటిని చూస్తాడు. అప్పుడు" అయం గౌః" — ఇది పశువు అనే జ్ఞానం ఏర్పడుతున్నది. తరువాత ఇంకొక గోవును చూసినప్పుడు అదే రూపసన్నివేశాన్ని చూసినపుడు "ఇది కూడా గోవు" అనే జ్ఞానం ఏర్పడుతున్నది.

భాస్కరమతఖండనం

1)బ్రహ్మం తప్ప వేరు ఏ వస్తువు అంగీకరించనందువల్ల ఉపాధి అనేది లేదు.

2) ఉపాధిలో ఉండే దోషాలు బ్రహ్మకు వస్తున్నందు వల్ల,

3) "అపహతపాప్మా విజరో విమృత్యుః" అని మొదలైన శ్రుతివాక్యాలకు విరోధం వస్తుంది. అందుచేత, ఈ మతం విడువదగినది.

యాదవమతఖండనం

1)బ్రహ్మమే ప్రపంచంగా పరిణమిస్తున్నది— అని అంటే,

2) బ్రహ్మనికి వికారం వస్తుంది. అందుచేత "అవికారాయ శుద్ధాయ" అనే వాక్యాలతో విరోధం వస్తుంది.

మీమాంసకమతఖండం

1) కర్మ అచేతనం. అది ఫలాన్ని ఇవ్వదు.

కర్మం అనేది భగవంతున ఆరాధన. అందుచేత, ఆ కర్మచేత

ఆరాధింపబడిన భగవంతుడు ఆనందించి ఫలాన్ని ఇస్తాడు.

"ఫలమతః ఉపపత్తేః" అని అంటున్నది బ్రహ్మసూత్రం.

అతః —ఆ బ్రహ్మం దగ్గర నుండే,

ఫలం— ఫలం కలుగుతున్నది,

ఉపపత్తేః— దేవతారాధన కనుక, యాగ, ఉపాసన, ఆరాధనలచేత ఆనందించిన భగవంతుడు ఫలాన్ని ఇస్తున్నాడు— అనేదే తగినది— అని తెలుస్తుంది.

**"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విధధామ్యహమ్"**
అనే గీతాశ్లోకం ఈ విషయాన్ని తెలుపుతున్నది.

ప్రాభాకరమతఖండనం

1) అపూర్వం అనేది ఫలాన్ని ఇస్తున్నది— అని అంటే, అపూర్వం అంటే ఏమి? అనే ప్రశ్న అడిగితే, సరిగా నిరూపించడం సాధ్యం కాదు.

2) కర్మచేత ఆరాధింపబడిన భగవంతుడే ఫలాన్ని ఇస్తున్నాడు. భగవంతునకు రూపం ఉన్నది. దీనిని నిరూపించే శ్రుతివాక్యాలు కొన్ని—

"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషః, హిరణ్యః కోశః

తస్య కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"

"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా".

"లక్ష్మీదేవి ఉన్నది" అని శ్రుతిని పురస్కరించుకొని స్వామి రామానుజులు నిరూపించారు.

"అస్య ఈశానా జగతః విష్ణుపత్నీ"

"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"

### పరమపదం

### అద్వైతి

బ్రహ్మం అంతటా అన్ని చోట్ల అన్ని వస్తువులలోనూ వ్యాపించి ఉన్నది. దానిని ఇక్కడే పొందవచ్చును, పరమ పదానికి పోయి పొందవలసిన ఆవశ్యకత లేదు —అని అంటున్నాడు.

దీనికి సమాధానాన్ని శ్రీరామానుజులు కొన్ని వేదవాక్యాలను పురస్కరించుకుని తెలుపుతున్నారు.

1)"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః",

2) "క్షయంత మస్య రజసః పరాకే",

3) ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్",

4) "అస్మాత్ శరీరాత్ సముత్థాయ, పరంజ్యోతి రుపసంపద్య, స్వేన రూపేణ అభినిష్పద్యతే"

అని ఒక దేశవిశేషంలో తన స్వరూపంతో ఆవిర్భవించి, "సోశ్నుతే సర్వాన్ కామన్ "అని గుణానుభవాన్ని పొందుతున్నాడు — అని చెప్పబడుతున్నది.

